# వివా
# పగలూ రాత్రీ చేవనిచ్చే పానీయం

గతిశీలమైన నేటి ప్రపంచంలోని వత్తిడికి తట్టుకోవాలంటే, చేవనిచ్చే వివా మీ కెంతో అవసరం.

**వివా రోజంతటికీ కావలసిన చేవను పెంపొందిస్తుంది!**

వివాలోని ఆధునికమైన మాత్రీకరణ మూలంగా, దీనిలో ఎక్కువ శక్తినిచ్చే 'మాల్ట్', 'టిష్యూ'ను పెంపొందించే ప్రోటీన్లూ ఉన్నాయి. ఇవి పనికీ, ఆటకీ కావలసిన శరీర శక్తిని పెంపొందిస్తాయి.

**వివా, ఖర్చయిన మీ శక్తిని భర్తీ చేస్తుంది రాత్రి పూట!**

పడుకోబోయే ముందు, వేడి వివా ఒక కప్పు తీసుకుంటే, అది మీకు సరియైన పద్ధతిలో నిద్ర పట్టేలా చేస్తుంది. మీరు ప్రొద్దున్న చలాకీగా, తాజాగా పుంజుకుని, నిద్ర లేచే దాకా పోషక శక్తిని సమకూరుస్తూనే ఉంటుంది!

వివా లేకుండా జీవితంలో యింత ఆనందం ఎక్కడుంటుంది గనక!

**వివా ఎక్కువ విలువ నిస్తుంది!**

ఒక్క బాటిల్ వివాని ఆరోగ్యాన్నిచ్చే మరే యితర పానీయంతోనైనా పోల్చి చూస్తే, యిది మరి ఎక్కువ కప్పుల పానీయాన్ని యిస్తుంది.






గొప్ప రుచి!

ASP-JIL-3-79 TEL R

**JiL** జగత్‌జిత్ ఇన్‌డస్ట్రీస్ లిమిటెడ్

25624p

OBM/1765 TEL

# ఇప్పుడు మీరు కన్య మీకు కావలసిన రక్షణ ఒక్క కేర్‌ఫ్రీ* మాత్రమే ఇవ్వగలదు



కేర్‌ఫ్రీ మిమల్ని దృష్టిలో పెట్టుకొని తయారు చేయబడింది. ఆ 5 రోజుల శానిటరీ రక్షణకోసం ఇది ఆధునికయువతికి చేదోడు.

కేర్‌ఫ్రీ ఒక ప్రత్యేకంగా చెమ్మనుపీల్చు నేప్‌కిన్. ఇది అధికమైన చెమ్మను పీల్చి మీకు ఇబ్బందిలేకుండా చేస్తుంది వాస్తవంగా, కేర్‌ఫ్రీ ఎంతపీల్చగలదంటే ఒకే ఒక నేప్‌కిన్ మీ పూర్తి సమయంలోని స్రవణంలో సగం దాకా నిలుపుకోగలదు. కాని తాజా భావనకోసం మీరుఎంత తరుచుగా కావాలంటే అంత తరచుగా మార్చుకోండి.

ఒక్క కేర్‌ఫ్రీ మాత్రమే దిగువ భాగము ప్రక్కలా చుట్టూ ఒక ప్లాస్టిక్ షీల్డ్ కలిగియున్నది. ఇది మరకల పట్ల త్రివిధ అడ్డంకిగా పనిచేస్తుంది.

కేర్‌ఫ్రీ తో మీరు హాయియైన భావన పొందగలరు. నెలలో ఇది ఏరోజో మీరు మరిచిపోతారు—చెమ్మ తగలటం ఉతికి ఆరవేసే ఇబ్బందిలేదు.

కేర్‌ఫ్రీ వాడకానికి తయారుగా వుంటుంది. మార్చుట చాలాసులభం. పారవేయుట చాలా తేలిక. అది ఆరోగ్యకరమైనదిగూడా.

కేర్‌ఫ్రీ ధరించండి.

ఎల్లప్పుడూ విశ్వాసంతో ఉండండి.




10 మరియు 20 నేప్‌కిన్ల ప్యాక్‌లలో లభిస్తుంది.

Johnson & Johnson

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభు ప్రసాద్

సంపాదకుడు:

[1938 1972]

శుక్రవారం : 3 7-'81

దుర్మతి నామ సం. ఆషాఢ శు. విదియ

సంపుటము 74 సంచిక 42

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

పోస్ట్ లో ఏడాది చందా రు. 67 60

ఆరు మాసాల చందా రు. 33 80

విడిప్రతి వెల రు. 1-25 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

నటి రాజ్యలక్ష్మి

(ఫొటో : ఎస్. ఆర్. డి. మూర్తి)

# సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు



## మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే తెలుపు

మీ బట్టలకు కళ్లు తిప్పుకోలేనంత తెల్లదనం—క్రమం తప్పకుండా సూపర్ రిన్‌తో ఉతికితే వాటి తెల్లదనం అద్వితీయం. మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే మరింత తెల్లటి తెలుపునిస్తుంది సూపర్ రిన్. ఎందుకంటే, సూపర్ రిన్‌లో తెలుపు చేసే శక్తి ఎక్కువ.

దీని తెలుపు చేసే శక్తిని మీకు మీరే
ఋజువు చేసుకోండి :

మరే ఇతర డిటర్జంట్ బార్‌తోనైనా ఉతికినది



సూపర్ రిన్‌తో ఉతికినది




సూపర్
రిన్‌లో తెలుపు చేసే శక్తి
ఎక్కువ

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పాదన.

లింటాస్-RIN. 35-2316 TL



# ఉత్తరాలు



## సీరియల్

29—5—81 సంచికలోని కార్టూన్స్‌లో పెళ్లి పీఎల మీద రెండు కార్టూన్స్ చాలా తమాషాగాను వినోదంగానూ, ఉన్నాయి.

"ఇంద్ర సింహాసనం" సీరియల్‌ను రచయిత్రి సి. ఆనందారామంగారు బహు తమాషాగానూ, నిపుణత, తాక్యములతోనూ, నడిపిస్తున్నారు. ఈ సీరియల్ చదువుతూంటే పాఠకులకు "ఇంద్రసింహాసనం" అనే గాథనే చూస్తున్నామా ?! లేక "ఇండియా సింహాసనం" అనే స్వతంత్రానంతర భారత రాజకీయ చరిత్రనే కళ్లారా చూస్తున్నామా !! అనే సందేహ—సంభ్రమ మిశ్రితమైన అనుభూతి కలుగక మానదు. ఈ సీరియల్‌లో మనం చూచే అనేకానేక పాత్రలూ, సంఘటనలూ రాజకీయ సన్నివేశాలూ కేవలం ప్రస్తుత స్వతంత్ర భారత రాజకీయ అంశాల అనుభూతిని కలిగిస్తాయి. ముఖ్యంగా "ఇందిరా—ణి" అదే— ఇంద్రాణి యొక్క రాజకీయ చతురత, ఆమెను రాజాస్థానానికి హాజరు పరచి కించ పరచాలని ప్రయత్నించగా ఆమెకు ఆ సంఘటన వల్లనే ఇంకా పలుకుబడి పెరగటమూ, జయంతుని "మలయమారుత" విమాన తయారీ ప్రయత్నమూ, మన ప్రస్తుత రాజకీయ సమరాంగణములో అధికాధికంగా కనిపిస్తున్న ఆయారామ్, గయారామ్‌లకు తోబుట్టువులా అనిపించగల చిత్రకేతుడూ, విచిత్రరథుడూ వీళ్ల ఆలోచనా సరళి — ఇలా వ్రాస్తూ పోతే దాదాపు సగభాగం సీరియల్ ఉదహరించవలసి ఉంటుంది.

ఎం. గోవిందరావు ( నరసరావుపేట )

## కథలు

12.6.81 తేదితో వెలువడిన మా అభిమాన ఆంధ్ర సచిత్ర వార పత్రికపై ముగ్ధ మనోహర మైన నటి సీమ ముఖచిత్రం మా మనసులను— రంజింప చేసింది. అదే విధంగా 35 వ పేజీలో ప్రచురించిన రోహిణి ఉపగ్రహానికి సంబంధించిన మూడు కలర్ పోటోలు అద్భుతంగా ఉన్నాయి. ముఖచిత్రం, ఈ పోటోలు ఈ వారం సంచికకే హైలైట్ అని చెప్పడం అతిశయోక్తి కాదు.

"నా విషయం నీకు తెల్వలేదు కుర్ర కుంక! నాను టిక్కట్టు ఇవ్వలేదంటే అవ్వలేదంతే" "నా కెదురు తిరిగినోడెవడూ బతికి బట్ట కట్టలా. నాను తలుచుకుంటే రేపేపాటికి నిన్ను శ్రీకాకుళం అడవుల్లోకి ట్రాన్స్‌ఫర్ చేయిత్తా తెలిసిందా?" అని అంతపని చేయగలిగిన 'శ్రీవార్లు' చాలా మంది ఉన్నారు కాని, "బ్రతుకు భయంతో నా నిజాయితీని అమ్ముకొని జీవితాంతం కుళ్ళి కుళ్ళి చావలేను" అని ఉద్యోగానికి రాజీనామా చేసే కండక్టర్లు ఉన్నారా అని అనుమానం. "ఆ ముగ్గురూ ...." కథలోని కండక్టర్ ధైర్యాన్ని చదివిన అతని నిజాయితీని అభినందించక తప్పదు. అందరు ఉద్యోగులు ఇలా నిజాయితీలో ధైర్యంగా వ్యవహరిస్తే అధికార మదాంధుల అరాచకాలను అరి కట్టడం ఏమంత కష్టం కాదు.

ఇదే సంచికలో 22 వ పేజీలో ప్రచురించిన 'సప్రాలా' గారి కార్టూన్ లోగడ ఆంధ్రపత్రికలో వచ్చిన కాటూరి గారి కార్టూన్‌కు అతి దగ్గరగా ఉంది. ఆ కార్టూన్ సారాంశం ఇది. "ఏమిటో ఈ మధ్య మీకు రోజూ పొద్దున్నే తలపోటువస్తోంది" అంటున్న భార్యతో భర్త ఇలా అంటాడు "ఆఫీసుకు కొత్త ఆఫీసరు వచ్చాడులే నిద్రపోడనికి వీలు లేకుండా ఉంది" అని. అదే విధంగా 12 పేజీలో ప్రచురించిన కార్టూన్—"ఇదిగో సార్! మీరు తెమ్మన్న ఇడ్లీ, పూరీ, దోసె, చపాతీ" అని నోటితో కరచి పట్టుకున్న ప్లేటు జారి పోకుండా మాట్లాడ గలగటం అసహజంగా ఉంది.

టి. వి. శ్రీనివాసరావు, టి. సత్యప్రసాదరావు
(అండలవారు)

* * *

హింది నటి తమన్నా ముఖ చిత్రంతో వెలు వడిన ( 5.6.81 ) ఆంధ్ర సచిత్ర వారపత్రిక నవ్యతతో మా ముందుకు వచ్చింది.

ఈ వారం కథలు మూడూ పత్రికకు హారమైతే "పింగుడు పడని మెతుకులు" మణి పూస వంటిది. రచయిత "పులికంటి కృష్ణా రెడ్డి" అభినందనీయులు.

అచార్యెల్లార్ ( కోటయ్య క్యాంపు కర్ణాటక)

* * *

12.6.81 సంచిక ముఖ చిత్రం( సీమ ) చాల అందంగా వుంది. కథల్లో మార్యదేవర రామ మోహన రావుగారి "ఆ ముగ్గురూ. . ." ప్రస్తుత కుళ్ళు వ్యవస్థకు వో నిదర్శనం . రచయితకు అభినందనలు.

వ్రతె నాంచారయ్య (విశాఖపట్నం.)

## లోకం పోకడ ✱ డిసిమెన్









సీరియల్

# ఇంద్రసింహాసనం

సి.ఆనందారామం

(గత సంచిక తరువాయి)

యయాతి తనకు అండగా రావటం నహుషుడికి కొండంతబలాన్ని ఇచ్చింది. అయితే నహుషుడి భవనంలో ఉండటానికి యయాతి ఒప్పుకోలేదు. అతడికి వేరే భవనం ఏర్పాటు చేసింది ఇంద్రాణి. విరామ సమయంలో దేవీపూజ, యుద్ధ సమయంలో వీరవిహారం. ఇవి రెండూ తప్ప మరొక వ్యాపకం లేదు యయాతికి. అతడి దివ్యాస్త్ర సంపద ముందు, ధైర్యసాహసాల ముందు, పరాక్రమ విజృంభణ ముందు దానవులు ఆగలేకపోతున్నారు. అది ఒక దీక్షగా – మహా తపస్సుగా యుద్ధం కొనసాగిస్తున్నాడు యయాతి. ఆ యుద్ధం పాతిక మానుష సంవత్సరాలు సాగింది. శుక్రాచార్యులు తన తపసు నంతా ధారపోసి రాక్షసులకు మాయలు నేర్పుతున్నాడు. మంత్రశక్తులు ప్రసాదిస్తున్నాడు కానీ అవన్నీ అత్యంత దీక్షతో నియమనిష్ఠలతో ఆరాధించి ప్రయోగిస్తున్న – యయాతి దివ్యాస్త్రాల ముందు నాశనమయిపోతున్నాయి. యయాతి వీరవిహారం ముందు రాక్షసులెవరూ నిలవలేకపోతున్నారు.

ఆనాడు యుద్ధరంగంలో మహాపరాక్రమంతో యుద్ధం చేస్తున్న నూనూగు మీసాల నూత్న యవ్వనంలో ఉన్న యువకుడిని చూసాడు యయాతి అతడు మానవుడు ఏ దేశపు రాకుమారుడో ? ఎంత పరాక్రమం ప్రదర్శిస్తున్నాడు? యుద్ధం ముగిసాక అతడినిఅభినందించాలనుకున్నాడు. కానీ మార్గ మధ్యంలోనే ఇంద్రాణి గూఢచారిణి దేవకన్య తారసిల్లి "ఇంద్రాణిగారు మిమ్మల్ని రమ్మంటున్నారు" అని చెప్పింది.

ఇంద్రాణి భవనానికి చేరుకున్నాడు యయాతి–అతనికి మెత్తని బంగారు ఆసనం చూపించి, యుద్ధంలో పడిన శ్రమ అంతా పోయేలా రకరకాల ఫలాహారాలూ, మధుర పానీయాలూ అందించి అప్పుడు చెప్పింది

"నువ్వు ఆ యువకుడిని అభినందించకూడదు. అందువల్ల కలిగిన ఆనందంతో అతడి దీక్ష తగ్గిపోతుంది. యుద్ధం ముగిసిన తర్వాతనే పరస్పర అభినందనలు ! రాక్షసులను పారద్రోలే వరకూ మనమంతా ఒక మహా దీక్షగా యుద్ధం సాగించాలి !"

తన మనసులో అనుకొన్నది ఇంద్రాణి కెలా తెలిసిందా అని విస్తుపోతూ "నేను ఆ యువకుడిని అభినందించాలను కొంటున్నానని మీకెలా తెలుసు ?" అని అడిగాడు.

"యుద్ధం చేస్తూ ఆ యువకుడి వైపు అనేకసార్లు మెప్పుదలగా చూసావని దేవకన్యలు చెప్పారు. యుద్ధం తరువాత అతని గుడారం వైపు పోతోంటే. నా దగ్గరకు తీసుకురమ్మని నేను చెప్పాను. విమానం మీద తిరుగుతూ యుద్ధరంగం అన్నివైపులా అనుక్షణం పరిశీలిస్తూనే ఉంటాను. యుద్ధ నిపుణులైన స్త్రీలిద్దరు సాయుధులై నా కంగరక్షకులుగా విమానంలో ఉంటారు."

"అబ్బా ! ఏమి రాజకీయ చతురత !!' అనుకున్నాడు యయాతి తన మనసులో. తన తండ్రి ఇంత యుద్ధ సమయంలో కూడా మధుర పానీయాలు సేవిస్తూ మత్తెక్కి వినోదాలలో మునిగి ఉన్నాడు. స్వర్గసౌఖ్యాలన్నీ

**జరిగినకథ – 12:** వృషపర్వపురానికి చెందిన రాక్షసరాజు వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠ అందం, తెలివితేటలు, ధైర్య సాహసాలు కల రాకుమారి. ఆమె, మానవ రాకుమారుడు యయాతి ఇరువురూ ఒకరినివిడిచి ఒకరు వుండలేనంత గాఢంగా ప్రేమించుకొంటారు. యయాతిని కలుసుకొని తమ నగరంపై దేవతల దండయాత్ర ఆపించమని శర్మిష్ఠను వృషపర్వుడు ఆజ్ఞాపిస్తాడు. తమ అనుబంధానికీ, రాజకీయాలకూ తండ్రి ముడిపెట్టడం ఇష్టంలేకపోయినా యయాతిని కలుసుకోవచ్చుననేభావం ఆమెకు ఆనందం కల్గిస్తుంది. ఇంద్రుడు చేసిన ఘోరాలను సహించలేక సప్తఋషులు అతన్ని పదవీచ్యుతుని గావించి, ఆ స్థానంలో యయాతి తండ్రి నహుషుడ్ని నియమిస్తారు. అతన్ని ఎలాగయినా దింపేసి మళ్ళీ ఇంద్రుడ్ని ఆ స్థానంలో నిలబెట్టాలని ఇంద్రాణి శచీదేవి ఆలోచిస్తూంటుంది. ఆమెకు నారదుడు సహాయపడతాడు. అతడు నహుషుణ్ని రెచ్చగొట్టి అగ్ని, వాయు, వరుణ, నిరృతులలో పరస్పర కలహాలూ, అధికార దాహమూ రగిలేటట్టు ప్రవర్తిస్తాడు. యయాతీ, శర్మిష్ఠలను ఒకటిగా చేస్తుంది ఇంద్రాణి. మహేంద్రుని ఆజ్ఞను ధిక్కరించాడనే నెపంతో జయంతుని యమలోకానికి పంపిస్తాడు నహుషుడు. తనకు అనుకూలుడైన వాడిని యముడి స్థానంలోఉంచి, తన కొడుకును నిర్దోషిగా నిర్ణయించేటట్టు చేస్తాడు నహుషుడు. దీనిని ముల్లోకాల ప్రజలందరూ ప్రతిఘటించడంతో జయంతుణ్నికూడా విడుదలచేయక తప్పలేదు. జయంతుడు భూలోకంలో విమానాల తయారీకి పూనుకొంటాడు. శత్రువర్గంతో చేతులు కలిపి, శుక్రాచార్యుల తపసు భంగం కాకుండా అడ్డుపడిందని ఇంద్రాణిని సభకు రప్పించి, విచారణ జరిపించి అపకీర్తి పాలవుతాడు నహుషుడు. స్వర్గంలో వుండలేక భూలోకానికి వచ్చేస్తాడు యయాతి. దేవయాని దాస్యం నుండి శర్మిష్ఠను విడిపించాలనే ఉద్దేశ్యంతో దేవయానిని వివాహమాడతాడు యయాతి. కాని అతని అంచనాలు తల్లక్రిందు లవుతాయి. దేవయాని శర్మిష్ఠను భూగృహం లో బంధించుతుంది. దేవయానికి శర్మిష్ఠపై గల కోపానికి కారణం యయాతికి చెప్తుంది శర్మిష్ఠ పరిచారిక విమత. ఆ తరువాత శర్మిష్ఠను విడుదల చేస్తుంది దేవయాని, దేవకన్య చెప్పగా. దేవయాని దేవలోకానికి వెళ్ళిన సమయంలో శర్మిష్ఠను వివాహమాడతాడు యయాతి ఈ విషయం తెలుసుకొన్న దేవయాని తన తండ్రి దగ్గరకు పోతుంది ఇంద్రాణికోరికపై దేవదానవ యుద్ధంలో పాల్గొనటానికి ఆమెతో దేవలోకానికి పోతాడు యయాతి.

కూడా ఏమాత్రం వెలితి లేకుండా జారుకోవాలని అతని తపన

యుద్ధం మరొక ఐదు మానుష సంవత్సరాలు కొనసాగింది. చివరకు రాక్షసులు చెల్లాచెదురయిపోయారు. శుక్రాచార్యుల తపశ్శక్తి చాలావరకు క్షీణించింది. యుద్ధం ఆగిపోయింది

యయాతి ఇంద్రాణి భవనానికి వెళ్ళి నమస్కరించి "అమ్మా! ఇకనాకు సెలవిప్పించండి-మా లోకానికి వెళ్తాను, శర్మిష్ఠ ఎలా ఉందో? నా సంతానం కొడుకో? లేక కూతురో?" అన్నాడు యయాతి ఈ మాటలంటుండగానే అతని శరీరాన్ని వృద్ధాప్యం కమ్మేసింది. చూపు మందగించింది. నడుం కొద్దిగా వంగింది. శరీరం ముడుతలు పడింది. జుట్టు నెరిసింది-శరీరమంతా వణకసాగింది.

"అమ్మా! ఏమిటిది? ఏమయిపోతోంది నాకు? ఎందుకిలా జరుగుతోంది?" ఆర్త స్వరంతో అడిగాడు.

ఇంద్రాణి అతడి దగ్గరగా వచ్చి భుజం మీద ఓదార్పుగా చెయ్యి వేసింది.

"మహారాజా! ధీరుడివి-ఖంగారుపడకు-స్థైర్యంతో నిలబడు. ఇది శుక్రాచార్యుల శాపం!"

"శుక్రాచార్యుల శాపమా? ఇప్పుడిచ్చారా శాపం!?"

"ఇప్పుడు కాదు - ఎప్పుడో ఇచ్చారు. దేవయాని తండ్రి దగ్గరకు వెళ్ళి నువ్వు తనకు అపచారం చేశావని చెప్పింది. దేవయానికి ఏ కొంచెం కష్టం కలిగినా శుక్రాచార్యులు సహించలేరు - అందుకే నీకు ముసలితనం రావాలని శపించాడు."

'అయితే అప్పుడే - నేను యుద్ధం చేస్తున్నప్పుడే ఎందుకు ముసలితనం రాలేదు?"

"మహారాజా! నువ్వు యుద్ధాన్ని ఒక దీక్షగా, ఒక మహాతపస్సుగా చేస్తున్నావు - తపస్సు అంటే అరణ్యాలకుపోయి చేసేది మాత్రమే కాదు-ఏకాగ్రతతో దీక్ష వహించి చేసేది ఏదయినా తపస్సే! యుద్ధసమయంలో నీ ఆత్మశక్తి ముందు శుక్రాచార్యుల శాపం పని చెయ్యలేదు- ఇప్పుడు యుద్ధం ముగిసి శర్మిష్ఠను తలుచుకోగానే నీ మనసు బలహీనమయింది. శుక్రాచార్యుల శాపం నీ మీద పని చేసింది. ఈ కారణంగానే నేను అనాడు నీ కొడుకుని కలుసుకోనివ్వలేదు."

"నా కొడుకునా?"

"అవును—ఆనాడు నువ్వు అభినందించదలచుకొన్న యువవీరుడెవరనుకొంటున్నావు? నీ కుమారుడు పూరుడు. ఆనాడే నువ్వు అతనిని కలుసుకొని ఉంటే- నీ కుమారుడని గుర్తిస్తే-అప్పుడే నీ మనసు బలహీనమయి ఉండేది. ఆ క్షణంలోనే వృద్ధాప్యం వచ్చి ఉండేది. అందుకే ఆ సమావేశం జరగకుండా అడ్డుపడ్డాను."

"నా కుమారుడు పూరుడా! ఆ మహావీరుడు? ఆహా! శర్మిష్ఠ ఎంత చక్కగా పెంచింది మా బిడ్డని? ఎక్కడున్నాడు, పూరుడు?"

"ఇప్పుడే పిలిపిస్తాను."

ఇంద్రాణి చప్పట్లు చరిచింది. పరిచారికలు వచ్చారు. "దేవకన్యలతో పూరుణ్ని ప్రవేశపెట్టమని చెప్పండి" అంది.

యుద్ధం ముగిసినప్పటి నుండీ పూరుడు ఇంద్రాణి భవనంలోనే ఉన్నాడు. ఇంద్రాణి ఆజ్ఞననుసరించి దేవకన్యలు అతడికి శుక్రుడి శాపమూ, అందుకు కారణమూ మొదలైన విషయాలన్నీ వివరంగా చెప్పారు. ఘోర శాపానికి కూడా భయపడని తన తల్లిదండ్రుల పవిత్ర ప్రణయానికి ముగ్ధుడయ్యాడు అతడు. మొదటి నుండీ తల్లిని గౌరవించే అతడి మనసులో తల్లిదండ్రులపట్ల గౌరవం మరింత



పెరిగింది. సహజంగా పరాక్రమవంతుడయిన ఆ పసివాడు తన తండ్రి పరాక్రమాన్ని కళ్ళారా చూసాడు. ఆ తండ్రి కొడుకెందుకు గర్విస్తున్నాడు.

పూరుడు వచ్చి వృద్ధాప్యం ఆవహించిన తండ్రిని చూసి ఏ మాత్రం ఆశ్చర్యం ప్రకటించక, విషాదాన్ని బయటకు రానీయక - పాదాలకు నమస్కరించాడు. జాలువారుతున్న ఆనందభాష్పాలతో కొడుకును లేవనెత్తి కౌగిలించుకొన్నాడు యయాతి.

''యయాతి మహారాజా! ఈ వృద్ధాప్యానికి దిగులుపడకు. ఏ దేవయాని దుఃఖం చూడలేక శుక్రుడు నీకీ శాపమిచ్చాడో, ఆ దేవయాని కోసమే ఈ శాపం మరలిస్తాడు. దేవయాని భర్తగా శుక్రుడి ముందు నిలిచి శాప మోక్షం కలిగించమని కోరుకో!''

''నేను వృద్ధుడినయ్యానని నాకు చింత లేదు తల్లీ! నా అంతటి పరాక్రమవంతుడు నా కొడుకున్నాడు.'' గర్వంగా పూరుణ్ని దగ్గిరగా లాక్కొని అతడిని అండగా చేసుకొని నిలబడ్డాడు.

''శుభమస్తు!, అని ఆశీర్వదించింది ఇంద్రాణి. పూరుణ్ని వెంటబెట్టుకొని విమానంలో భూలోకానికి బయలుదేరాడు యయాతి.

## 27

తన వృద్ధరూపం ప్రజలకు చూపలేక తిన్నగా శర్మిష్ఠ భవనానికి వచ్చేసాడు యయాతి. అప్పటికే దేవయాని చెలికత్తెల మాటిపోటి మాటల ద్వారా శర్మిష్ఠకు శుక్రాచార్యుల శాప వృత్తాంతం తెలిసింది. తెలిసిన క్షణం నుంచీ ఆమె మానసికంగా కుమిలిపోతూ ఈ శాపం తన భర్తకు తగలకుండా వుండాలని పూజలు చేస్తోనే ఉంది - ఇప్పుడు ప్రత్యక్షంగా వృద్ధాప్యం పొందిన భర్తను చూస్తూ శిలలా నిలిచిపోయింది. ఆమెకు అడుగు ముందుకు పడలేదు. యయాతి నవ్వటానికి ప్రయత్నిస్తూ ''ఏం, శర్మిష్ఠా! ఈ వృద్ధుణ్ని సమీపించలేక పోతున్నావా?'' అన్నాడు. ఆ మాటలతో శర్మిష్ఠ పరుగున వచ్చి యయాతి పాదాల మీద వాలిపోయి భోరున ఏడ్చేసింది. ఆమెను లేవనెత్తి వణుకుతున్న చేతులతోనే అక్కున చేర్చుకొన్నాడు యయాతి.




## అనారోగ్యులు అభాగ్యులు

మీకు విశాలమైన ఛాతీ, దృఢమైన శరీరం, మంచి తూనిక గలదా? లేకుంటే వెంటనే 'జీవన్‌టోన్' ఉపయోగించుట మంచిది. మీరు ఒక పౌండు జీవన్‌టోన్ కొన్నారంటే మీ శరీరం దృఢమై, తూనిక అధిక మగుటకు మేము గ్యారంటీ ఇవ్వగలము.

## ఆరోగ్యమే భాగ్యము

నిజమే ఆరోగ్యమే భాగ్యము. ఆరోగ్యం బాగా వున్నట్లయితే డబ్బును సంపాదించడం అసాధ్యమేమీ కాదు! లేకుంటే... జీవన్‌టోన్ సాధారణమైన వ్యక్తులకు వచ్చే వ్యాధులను ఇట్టే బాగుచేయగలదు. మీరు మీ వయసుకన్న అధిక వయసుగలవారిలా గోచరిస్తున్నారా? అలాగైతే వెంటనే ఉపయోగించడం ప్రారంభించండి 'జీవన్‌టోన్'. మీకు తగినంత ఆరోగ్యం, దృఢకాయం, తూనిక సమకూరిన వెంటనే జీవన్‌టోన్ ఉపయోగించుట ఆపుచేయాలి.

కాగా దేహానికి బలం సమకూర్చడానికి, తూనిక అధికరించడానికి జీవన్‌టోన్‌లో కొన్ని విశిష్టమైన మూలికలు చేర్చబడి యున్నవి. కాని ఇందులో జంతువుల క్రొవ్వు చేర్చబడి యుండలేదు. స్పెషల్ జీవన్‌టోన్ పెద్ద సీసాలు అన్నిచోట్ల సులభంగా లభించగలవు. (వ్యాయామం అవసరం లేదు. ఒకవేళ ఇంతకుముందు అలవాటు వున్నట్లయితే కొనసాగించవచ్చు.) వెల : **454** గ్రాములు (1 పౌండు రు. **20/-**) ★ సెల్‌బాయిల్ మరియు సెల్ఫో పౌడర్ : వయసుకు వచ్చినవారికి మాత్రమే వెల : రు. **24-00** (ఉభయులకు) ★ స్కిన్ లీక్సు : మొటిమలను తొలగించి మీ ముఖమును సుందరముగా తేజోవంతముగా వుంచును. వెల : రు. **20-00**. క్రిందిచోట్లయందు లభించగలవు :

వరంగల్ : ఆయుర్వేద రసాయనశాల, జె. పి. ఎన్. రోడ్డు ఆయుర్వేద మెడిసిన్ ఆయుర్వేద ఇన్‌గ్రిడియన్స్, ఎమ్. జి. రోడ్డు. మచిలీపట్నం : ఉమామహేశ్వర ఆయుర్వేదిక్ ఏజెన్సీస్, తెనాలి : గుడివాడ హనుమంతరావు & సన్స్. హైదరాబాద్ : సంపత్ & కం., పంజగుట్ట, జైరాం మెడికల్స్, కోటి, బ్యాంక్ రోడ్డు, వసంత్ మెడికల్‌స్టోర్స్, 4-4-293, బ్యాంక్‌రోడ్డు, మహేశ్ మెడికల్‌హాల్, క్లాక్ టవర్ ఎదుట, విష్ణు మెడికల్ హాల్, గుల్జార్‌హౌస్. ఇచ్ఛాపురం : జనతా మెడికల్‌స్టోర్స్. పర్లాకిమిడి : పి. ధర్మనారాయణమూర్తి & సన్స్. కాశీబుగ్గ : తంగుడు నారాయణమూర్తి. టెక్కలి : టి. ఎస్. ఎన్. మూర్తి. పార్వతీపురం : పద్మినీ మెడికల్ స్టోర్స్. పాలకొండ : సూర్య డ్రగ్ హౌస్. శ్రీకాకుళం : పట్నాల సత్యనారాయణ అండ్ సన్స్, పాలచెట్టు స్ట్రీట్. విజయనగరం : భట్ల లింగప్రసాదరావ్ మైన్‌రోడ్డు. విశాఖపట్నం : నీలం & కం., ఎ.వి. ఎన్. కాలేజి రోడ్డు, డా. జె.ఎ. శాస్త్రి, సూర్యాబాగ్ జంక్షన్. రాజమండ్రి : ఈశ్వరదాస్ & కం., జైహింద్ బిల్డింగ్. గుంటూరు : ఆంజనేయ మెడికల్స్, జిన్నా టవర్‌సమీపం. శ్రీ సత్యనారాయణ ఏజెన్సీస్. కాకినాడ : లక్ష్మీనారాయణ కంపెనీ. విజయవాడ : శ్రీ ధనలక్ష్మి మెడికల్‌స్టోర్స్, సూర్యా మెడికల్ స్టోర్స్, పార్కురోడ్డు. అనకాపల్లి : కాసుమంచి అప్పలరాజు. మదనపల్లె : హయగ్రీవ షాప్, 10/75 నెహ్రూస్ట్రీట్. నెల్లూరు : కె. ఎస్. రావ్ & సన్స్, ట్రంక్‌రోడ్డు. సూర్యాపేట : కమర్షియల్‌సూర్య నివాస్— 2 టవున్ పోలీస్‌స్టేషన్ ఎదుట. సికిందరాబాద్ : జ్యోతిమెడికల్‌హాల్ 28. ఎమ్. జి. రోడ్డు, డి. జె. వరేక్ & కంపెనీ, సుభాష్‌రోడ్డు. బామ్మా నసీరు, శారదాస్టోర్స్, 3106 రాష్ట్రపతిరోడ్డు. కావలి : డా. మల్లేశ్వరరావ్, ఆర్.ఎమ్.పి. మెస్సర్స్ సుగుణ ఆయుర్వేద ఆలయం. రేపల్లె : రామకృష్ణ మెడికల్ అండ్ జనరల్ ఏజెన్సీస్, రైల్‌పేట. తాడేపల్లిగూడెం : కల్యాణరామ ఆయుర్వేద వైద్యశాల, మావిడివారిస్ట్రీట్, ఓవర్ బ్రిడ్జి సమీపం. కందుకూరు : సుమిశెట్టి వెంకటేశ్వర్లు మెడికల్ స్టోర్స్. తిరుపతి : తరిగొండ మెడికల్స్, 247-బి, సరోజినిరోడ్డు. అనంతపురం : డి. సోమనాథశాస్త్రి, మునిసిపల్ కాలని. రామచంద్రపురం : రూపా మెడికల్‌స్టోర్స్, మునిసిపల్ మార్కెట్టు, సుభాష్ రోడ్డు. అనంతపురం : కో—ఆపరేటివ్ సెంట్రల్ సొసైటీ లిడ్., రైల్వేస్టేషన్ సమీపం. పులివెందుల : శ్యామ్ మెడికల్ స్టోర్స్, మైన్‌బజార్. హిందూపురం : కె. ఆర్. భాస్కరయ్య & సన్స్, మైన్ బజార్. బాలాజీ మెడికల్ సెంటర్, మైన్‌బజార్. ఆదోని : కమలాపుర్ గోవిందశెట్టి, ఆర్. ఎమ్. పి. కమలాపుర్ నాగయ్యశెట్టి & సన్స్, కొత్తగూడెం : నరేంద్రుల శంకరయ్య & సన్స్. ధర్మవరం : శ్రీ నంజుండేశ్వర మెడికల్‌స్టోర్స్, మైన్‌బజార్. గుంతకల్లు : గోపాల్ మెడికల్‌స్టోర్స్. జంగారెడ్డిగూడెం : బేడ వెంకటరావ్. రాయదుర్గం : శ్రీ లక్ష్మీవెంకటేశ్ మెడికల్‌స్టోర్స్. తాడిపత్రి : కృష్ణ మెడికల్స్, మైన్‌రోడ్డు. గోరంట్ల : వెంకటేశ్వర మెడికల్ స్టోర్స్, హిందుపురం పోస్ట్. కర్నూలు : శ్రీ రామకృష్ణ మెడికల్‌హాల్, 52/19 బాస్టియన్‌రోడ్డు. గుత్తి : డి. ఆర్. రాజశెట్టి & సన్స్, మైన్ బజార్. పామిడి : ఎన్. సి. చిన్నప్పశెట్టి. కడప : శ్రీ సాయిరామ్ ఆయుర్వేదిక్ మెడికల్స్, 13/348 మనిరావ్‌స్ట్రీట్. గిద్దలూరు : ఎమ్. సాంబయ్యశాస్త్రి అండ్ సన్స్. అన్ని మెడికల్‌స్టోర్స్ అండ్ బుక్ సెల్లర్స్.

అధికృత విక్రయందార్లు : మెస్సర్స్ : బాలాజి కెమికల్ వర్క్స్, ఎ. పి. ఐ. ఇ. 5 వ రోడ్డు, బాలనగర్, హైదరాబాదు—37, ఫోన్ : 269490.

పైపేర్కొనబడిన తయారీలు మీ వూరియందు లభించనట్లయితే దయచేసి రు. 5—00 మాకు పంపిన మీకు వి. పి. పి. ద్వారా పంపగలము.

మెసర్స్ : జీవన్‌టోన్ ప్రోడక్ట్స్, పోస్టుబాక్స్ నెం. 880, 17/1, కేంబ్రిడ్జి రోడ్డు, అలుసూరు, బెంగుళూరు-560 008.

## ఇంద్రసింహాసనం

అతని కళ్ళనుండి కూడా నీరు ధారలు కడుతోంది. అలా ఆ దంపతులు ఒకరి చేతులలో మరొకరు దుఃఖిస్తున్న సమయంలో యయాతి రాక తెలుసుకొని, దేవయాని శర్మిష్ఠ భవనానికి వచ్చింది.

"మహారాజా! కుశలమా?" అని ప్రశ్నించింది, హేళన నిండిన నవ్వుతో – శర్మిష్ఠ దూరంగా జరిగి కళ్ళు తుడుచుకుంది – యయాతి చిరునవ్వుతో "నా క్షేమాన్ని గురించి నువ్వు విచారించవలసిన అవసరంలేదు దేవయానీ! మీ తండ్రి ఆచార్యుడుగా ఉన్న రాక్షస బలాన్ని చెల్లాచెదురుచేసిన తరువాతనే, నాకీవృద్ధాప్యం వచ్చింది. రాజు కోరేది సౌందర్యం కాదు - కీర్తి ప్రతిష్ఠలు – నేనూ నా కుమారుడు పూరుడూ కూడా ఈనాడు ముల్లోకాలలో కీర్తింప బడుతున్నాము – అది చాలు నాకు!" అన్నాడు యయాతి పూరుణ్ని ఉద్దేశించి గర్వంగా నా కుమారుడు అనటం దేవయానిని గుచ్చుకొంది. శర్మిష్ఠ వంక తిరిగి "రాణి శర్మిష్ఠా! ఇక నీ ప్రణయాన్ని తనివితీరా అనుభవించు" అంది.

శర్మిష్ఠ దేవయానిని చూసి ప్రశాంతంగా నవ్వింది–"దేవయానీ! ప్రణయాన్ని శరీరంతో అనుభవించరు. మనసుతో అనుభవిస్తారు. మహారాజు మనసుకి వృద్ధాప్యంలేదు–రాదు –ఏ శాపాలూ దానిని తాకలేవు"

దిగ్భ్రాంతి పొందింది దేవయాని. కుమిలి కుమిలి ఏడుస్తుందనుకొన్న శర్మిష్ఠ ఇలా మాట్లాడుతోంది. ఇక తను ఏమి సాధించినట్లు? ఈసారి కూడా తనే ఓడిపోయిందా? ఏదో కసి, పట్టుదల పెరగసాగింది ఆమెలో.

"ఇకమీరు ఈ రాజ్యభారాన్ని ఎలాగూ వహించలేరు – యదువుకు పట్టాభిషేకం చేసెయ్యండి" అంది.

"రాజ్యాంగ విషయాలు ఒక వ్యక్తి నిర్ణయించవలసినవి కావు. మంత్రి మండలిని పిలిపించి ఆలోచిస్తాను."

కోపంగా వెళ్ళిపోయింది దేవయాని.

ఆ రోజు సాయంత్రం ఎప్పటి అలవాటు చొప్పున కిటికిలోంచి బయటికి చూస్తూ నిలబడింది దేవయాని. ఎప్పటిలా ఆమెకు శూన్యం కనిపించలేదు – దూరంగా ఒక మనోహర దృశ్యం కనిపించింది. శర్మిష్ఠ భవన ప్రాంగణంలోని ఉద్యానవనంలో ఒక

మణి వేదిక మీద వృద్ధాకృతిలో యయాతి కూర్చొని ఉన్నాడు శర్మిష్ఠ క్రింద కూర్చొని అతని వడిలో తల పెట్టుకొని చేతితో అతని పాదం మీద వ్రాస్తూ ఏదో అంటోంది – యయాతి పెద్దగా నవ్వుతున్నాడు. ఎంత అందంగా ఉన్నాడు యయాతి? వృద్ధాప్యం అతని సౌందర్యాన్ని ఏమాత్రం కమ్మలేదు! సౌందర్యం వయసు నాశయించుకొని ఉండదా? ఏ వయసులో ఉన్నా, వ్యక్తిని శోభింపచేసేది అతని ప్రతిభ, అతని నైతికస్థాయి. శర్మిష్ఠ తన వయసు కంటె చిన్నగా కనిపిస్తోంది. యయాతి యుద్ధరంగంలో ఉన్నంతకాలమూ శర్మిష్ఠ పూజలతో ఉపవాసాలతో గడిపిందట! అందుకే చిక్కి ఉంది. కానీ ముఖం ఎంత కాంతివంతంగా ఉంది? సిగ్గుతో అరమోడ్చిన ఆ కళ్లలో ఎంత ఆనందం? ఏ శక్తులు — ఏ శాపాలు — ఈ ఆనందాన్ని నాశనం చెయ్యగలవు?

దేవయాని మనసులో ఏదో అశాంతి రగిలింది. కిటికీదగ్గర ఎక్కువసేపు నిలవలేక పోయింది తన భవనంలో ప్రతి వస్తువూ చిందరవందర చేసింది. కంటి కెదురైన పరిచారికను నోటికి వచ్చినట్లు నిష్కారణంగా తిట్టింది. అది కన్నీళ్లు పెట్టుకుంటె, దగ్గరకు పిలిచి బంగారు గొలుసు కానుకగా ఇచ్చింది. తనను తెల్లబోయి చూస్తున్న అందరినీ పొమ్మని గది తలుపులన్నీ వేసుకుని అలంకారాలన్నీ విసిరిపారేసి కటికనేలమీద వాలిపోయింది. గుండెల్లో ఎక్కడో భయంతో అణిగి మణిగి ఉన్న దుఃఖం ఏకాంతం దొరకగానే పొంగి పొంగి వచ్చింది. ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లిపోయింది— ఆ అర్ధ చేతనావస్థలో మనసు లోపలి పొరలలో రూపు కట్టింది, సమాధి మగ్నుడయిన కచుని మూర్తి.

* * *

యయాతి మంత్రి మండలిని సమావేశపరిచాడు వారంతా యయాతికి కలిగిన విపత్తుకు తను పరితాపం ప్రకటించారు. యదువును మహారాజును చేసే విషయం ప్రస్తావించాడు— మంత్రులంతా కొంతసేపు మౌనంగా ఉండిపోయారు. చివరకు ప్రధాన మంత్రి ధైర్యంచేసి "మహారాజా! ఈ పరిస్థితుల్లో యదువును మహారాజును చేయటం దేశానికి చాలా ప్రమాదం. మీరు స్వర్గంలో యుద్ధంలో ఉన్న సమయంలో సామంత రాజులు కొందరు తిరగబడి స్వాతంత్ర్యం ప్రకటించుకొన్నారు శత్రువులలో చాలా మంది సమయంచూసి దేశాన్ని కబళించాలని సన్నాహాలు చేస్తున్నారు.

యదువు ఏ నాడూ యుద్ధ శిక్షణ పొందలేదు అంతేగాక ప్రభువులు క్షమిస్తే భోగలాలసుడై ఉన్నాడని విన్నాము. అతడిని రాజును చేస్తే మరుక్షణమే దేశం శత్రువుల వశమవుతుంది. ఏలాగైనా కొంతకాలం తమరే ఈ రాజ్యభారం వహించి – సామంతులకు బుద్ధిచెప్పాలి. శత్రువులను అణిచివెయ్యాలి ఈ లోగా యదువుకు మారుడికి తగిన శిక్షణ ఇచ్చి ఆ తరువాత మహారాజును చెయ్యండి" అన్నాడు.

రాజ్యవ్యవహారాలు యయాతికి ఆందోళన కలిగించాయి. కానీ అతడి మనసుకి ఉన్న ఉత్సాహం శరీరానికి లేదు. ఆ శరీరంతో అతడేదీ సాధించలేడు. అతడికి పూరుడిని రాజుని చెయ్యాలని ఉంది పూరుడే సమస్యలన్నీ పరిష్కరించగలడనే విశ్వాసం ఉంది. శర్మిష్ఠ కొడుకనేగాక, పూరుడి పరాక్రమమూ, ప్రజలపట్ల ప్రేమాభిమానాలూ, దేశభక్తీ, స్వయంగాచూసాడు—కానీ అతడామాటమంత్రి మండలి ముందు అనలేకపోయాడు. పెద్ద కుమారుడు రాజ్యానికి వారసుడు కావటం రాజకుటుంబాలలో ఆచారం. మంత్రుల హావభావాలను బట్టి వారికి కూడా యదువు రాజు కావటం ఇష్టంలేదని అర్థంచేసుకొన్నాడు.

శుక్రాచార్యుడి దగ్గరకి వెళ్లి శాపమోక్షం కోసం ప్రాధేయ పడటం అతనికి ఇష్టం లేదు. కానీ, ఇప్పటి పరిస్థితుల్లో తప్పేలా లేదు. దేశాన్ని శత్రువులపాలు చెయ్యలేడు.

శుక్రాచార్యుడిని దర్శించటానికి సంకల్పించుకొని ఆ సంగతి శర్మిష్ఠతో చెప్పాడు. శర్మిష్ఠ ముఖం చిన్నబోయింది.

"అదేం? నేను తిరిగి యవ్వనం పొందటం నీకు ఆనందం కాదా?"

"మీరు యవ్వనవంతులవటం సంతోషమే కానీ, దేవయాని తిరిగి ఏ చికాకులు కలిగిస్తుందోనని భయపడుతున్నాను."

యయాతి నవ్వాడు.

"ఇంతవరకూ దేవయాని వింత ప్రయాస పడ్డా, మనను ఏం చెయ్యగలిగింది? నువ్వు నాకూ, నేను నీకూ ఉన్నంత కాలం ఎవరూ మనను ఏమీ చెయ్యలేరు. వెళ్లిరానా?"

శర్మిష్ఠ అతని నొసట పూజా కుంకుమ దిద్ది సాగనంపింది.

శుక్రాచార్యుడు, వృషపర్వుడు మొదలైన వారంతా ఒక చోట సమావేశమయి భావి కార్యక్రమం ఆలోచించుకొంటున్నారు. ఆ సమయంలో వెళ్లి శుక్రుడికి నమస్కరించాడు యయాతి. ఆ రూపంలో అల్లుడిని చూసి శాప మిచ్చిన శుక్రుడికే మనసు నీరయింది. ప్రతిపక్షంలో ఉన్నా అతడి పరాక్రమాన్ని చూసి ఎంత మెచ్చుకొన్నాడు? తన మంత్ర బలం వ్యర్థం కావటానికి అతని పరాక్రమమే కారణం- ఏమి యుద్ధ దీక్ష! తన శాపం కూడా వ్యర్థమయ్యేటంతటి దృఢ దీక్ష! చివరకు ఎలా మారిపోయాడు?

వృషపర్వుడు కూడా యయాతిని చూసి



# ఇంద్రసింహాసనం

బాధపడ్డాడు. మనసులో మెచ్చుకొన్నాడు. శర్మిష్ఠను బానిసత్వం నుండి విముక్తురాలిని చేసి రాణిని చేసిన అతడిపట్ల ఎంతో గౌరవం కలిగింది అతనికి. కానీ శుక్రుడి సమక్షంలో ఏమీ మాట్లాడలేదు.

యయాతి చేతులు జోడించి "మహా మునీ! మీరు నాకు ఈ ఘోర శాపం ఇచ్చారు. కానీ దీనివల్ల వ్యథ పొందేది నే నొక్కడినేనా? మీ కుమార్తె దేవయాని సహితం సౌఖ్యాలకు దూరం కావటంలేదా? దయచేసి శాపమోక్షం అనుగ్రహించండి" అన్నాడు.

ఈ మాటలతో శుక్రుడిమనసు పూర్తిగా కరిగిపోయింది. దేవయాని– తనకు ప్రాణ ప్రదమైన దేవయాని– ఈ శాపంకారణంగా సౌఖ్యాలకు దూరం కావలసి వస్తోంది.

"యయాతి మహారాజా! నా తపశ్శక్తి అంతా యుద్ధ తంత్రాలతో, ఈ శాపాలతో క్షీణించిపోయింది. నీకు తిరిగి యవ్వనం తెగలిగే శక్తి నాకు లేదు. కానీ, నీ కుమారు లలో ఒకరికి నీ ముసలితనం ఇచ్చి వారి యవ్వనం నువ్వు తీసుకోవచ్చు. వెళ్ళు. ప్రయ త్నించు."

"మహామునీ! ఇది నాకు శాపమోక్షంలాగా లేదు. నా కుమారులకు పరీక్షలాగా ఉంది. సరే చూస్తాము. ఎవరు నెగ్గుతారో? సెల విప్పించండి."

హస్తినాపురానికి వచ్చిన తరువాత తన కుమారులందరినీ సమావేశపరిచాడుయయాతి యదువు మొదలయిన వారికి అతడు తమ తండ్రి అనే పరిజ్ఞానం కూడా లేదు. వారెప్పుడూ తలిదండ్రుల ప్రేమాభిమానాలకు నోచుకోలేదు. పూరుడికి మాత్రం యయాతి పసితనంనుండీ తన తండ్రిగా తెలుసు. అతడు తండ్రికి ఎంతో దూరాన ఉన్నా, తల్లి ప్రేమలో పెరిగాడు. తల్లి తను స్వయంగా చిత్రించిన తండ్రి చిత్రపటం చూపి, తండ్రి సంగతులెన్నో చెప్పేది. తండ్రి పరాక్రమం గురించీ, సాహసం గురించీ, త్యాగశీలత గురించీ, ఎన్నెన్నో కథలుచెప్పేది. ఆ కారణం చేత పూరుడి మనసులో తండ్రి ఒక మహాను భావుడిగా, ఒక ఆదర్శ స్వరూపంగా స్థిరపడి ఉన్నాడు.

యయాతి తన కొడుకులను ఉద్దేశించి "నాయనలారా? చూస్తున్నారు కదా, నా శరీరాన్ని- శుక్రాచార్యుల శాపం చేత వృద్ధాప్యం ఆవహించింది. కానీ ప్రస్తుతం మనదేశం చాలా క్లిష్టస్థితిలో వుంది. అంతశ్శత్రువుల నుండీ, బాహిర శత్రువుల నుండీ కూడా మనను మనం కాపాడుకోవాలి. అందుకు నాకు శక్తి కావాలి. యవ్వనం కావాలి – మీలో ఎవరోఒకరు నా వృద్ధాప్యం తీసుకుని మీ యవ్వనం నాకిస్తే, శత్రువులను అణచివేసిన తర్వాత మీ యవ్వనం మీకిచ్చి నా వృద్ధాప్యం నేను గ్రహిస్తాను. ఈ త్యాగం ఎవరు చేయగలరో చెప్పండి!" అన్నాడు.

ఎవరూ మాట్లాడలేదు అంతా ఒకరి ముఖం మరొకరు చూసుకున్నారు. అదుపూ ఆజ్ఞా లేకుండా పెరగటంవల్ల కలిగిన నిర్లక్ష్య స్వభావానికి వారసత్వంగా వచ్చిన తల్లి అహంకారం జతకాగా యదువు లేచి నిరసనగా "ఏం మాట్లాడుతున్నారు మీరు? చిన్న వాళ్ళమయిన మేము ముసలివాళ్ళం కావాలా? మీరు మా వయసూ, యవ్వనం తీసుకుం టారా? ఆహా! ఎంత బాగుంది! ఇంత వయసు వచ్చిన మీకే కోరికలు చావకపోతే, మాకెలా ఉంటుంది? మాకు మాత్రం సౌఖ్యాలు అనుభవించాలని ఉండదా? ఇప్పటి నుంచీ వృద్ధాప్యం మీద వేసుకుని, వృద్ధాప్యంతో ఎంతకాలం బతకమంటారు?" అన్నాడు.

యయాతి మాట్లాడలేదు. మిగిలిన వారి ముఖాలు చూశాడు. అందరూ తలలు వంచు కొన్నారు. పూరుడు మాత్రం లేచి "తండ్రీ! మీ ముసలితనం నేను భరిస్తాను. నా యవ్వనం తీసుకుని దేశాన్ని రక్షించండి" అన్నాడు. యయాతి పరమానందంతో చేతులు జాపాడు. పూరుడు అతని కౌగిలిలోకి వచ్చాడు. పూరుడు వృద్ధుడయిపోయాడు. యయాతి నవయువకు డయ్యాడు

"నాయనా! ఈ వృద్ధాప్యం భరించ గలవా?" అన్నాడు యయాతి.

"నాయనగారూ! అమ్మ చెప్పలేదా, వయసు శరీరానికిగాని, మనసుకి కాదని! నా కళ్ళు చూడలేకపోయినా, మరొకరితో చదివించుకొని శాస్త్రాలు అభ్యసిస్తాను. దివ్యాస్త్రాలు నేను ప్రయోగించలేకపోయినా సాటి వీరకుమారుల చేత ప్రయోగింపచేసి, అనేకమందిని దివ్యాస్త్ర సంపన్నులను దేశంలో తయారు చేస్తాను. ఈ వృద్ధాప్యం నా జీవితాన్ని వ్యర్థంచేయలేదు."

ఆ మాటలు వింటూ ప్రేమతోకొడుకుని కౌగలించుకోబోయాడు యయాతి. పూరుడు వెనకడుగువేసి "వద్దు! వద్దు! నన్నుదగ్గరకు తీసుకోకండి. నా వృద్ధాప్యం మీకు తిరిగి వచ్చెయ్యవచ్చును. శుక్రాచార్యుల మంత్ర మహిమ, ఓషధీ మహిమ. అసామాన్యమైనవి" అన్నాడు.

"ఆహా! ఎంత ఆదర్శశీలివయ్యా! దేశాన్ని ఇంతగా ప్రేమించే నీవే, ఈ దేశానికి రాజా కావటానికి అర్హుడివి. ఈనాడే విషయం మంత్రిమండలిలో ప్రకటిస్తాను."

ఆ రోజే సభతీర్చాడు యయాతి. సభలో మంత్రులు, సామంతులు– ప్రజా ప్రతినిధులు, తత్త్వవేత్తలు– ఆచార్యులు– యుద్ధవిద్యా గురువులు, వీరయోధులు అంతా ఉన్నారు. వెనుకటికంటె మరింత ఉత్సాహంగానూ నూతన యవ్వనంలో ఉన్న రాజును చూసి అందరూ ఆశ్చర్యపోయారు శత్రువులు కృంగిపోయారు. స్వదేశాభిమానులు ఉప్పొంగిపోయారు.

ఆ నిండు సభలో తనకు శుక్రాచార్యుల శాపవశాన వృద్ధాప్యం రావటమూ, అది పూరుడు గ్రహించి రాజ్యసంరక్షణ కోసం అతని యవ్వనాన్ని తనకివ్వటమూ చెప్పి "దేశం కోసం ఇంత త్యాగం చేసిన మహావీరుడైన పూరుణ్ణి నా తర్వాత హస్తినాపురానికి రాజుగా ప్రకటిస్తున్నాను" అన్నాడు.

సభలో హర్షధ్వానాలు చెలరేగాయి. పూరుడు ఎంతటి ప్రజానురంజకుడో యయాతికి అర్థమయింది

అతని మనసు సంతృప్తితో నిండిపోయింది.

రాజ్యాన్ని మంత్రి మండలికీ, పూరుడికీ అప్పగించి, కొంత సేనను రాజ్యరక్షణకు రాజధానిలో వుంచి మిగిలిన సేనతో ఎదురు తిరిగిన సామంతులను అణచటానికి బయలుదేరాడు.

## 28

అకస్మాత్తుగా హస్తినాపురాన్ని శత్రువులు ముట్టడించారు. రాజు రాజధానిలో లేడు సైన్యం కూడా కొంచెమే ఉంది. రాజకుమారులలో సమర్థుడయిన పూరుడు అకాల వృద్ధుడయిపోయాడు. మిగిలిన వారు అసమర్థులు విషయలాలసులు. ఈఅవకాశాన్ని వినియోగించుకోవాలనుకొన్నారు శత్రురాజులు. యుద్ధ ధర్మాలను కూడా అతిక్రమించి, ఏ విధమయిన ప్రకటనా లేకుండా హస్తినాపురం మీద దాడి చేసారు.

పూరుడు వృద్ధాప్యం తానుగా వరించిన నాటినుండీ- యయాతి దేశంకోసంయువకుడై సామంతులను అణచటానికి వెళ్లిన నాటినుండీ శర్మిష్ఠ అతిశ్రద్ధగా దేవిని ఆరాధిస్తోంది. కొద్దిపాటి పళ్ళు తప్ప ఏ ఆహారమూ తీసుకోదు. కటిక నేలమీద పడుకొంటుంది. అలంకారాలన్నీ వదిలేసింది. పూరుడు నమస్కరించినపుడు మాత్రమే మౌనంగా ఆశీర్వదిస్తుంది.

శత్రువుల దండయాత్ర సంగతి విని పూరుడు తల్లి దగ్గరకు వచ్చాడు. ఆమె అప్పుడే తన ధ్యానం ముగించుకొంది పూరుడు నమస్కరించి దిగులు నిండిన స్వరంతో "అమ్మా! శత్రువులు దేశాన్ని ముట్టడించారు. నేను అసమర్థుడనయి ఉన్నాను. సేనకూడా కొంచెమే ఉంది" అన్నాడు.

శర్మిష్ఠ కొంచెంసేపు ఆలోచిస్తూ నిలబడింది. చుట్టూ ఎవరి ముఖంలో చూసినా భయాందోళనలే! "నాయనా! వెళ్ళు! శత్రుసైన్యాన్ని ఎదుర్కో! నీకు విజయం సిద్ధిస్తుంది" అంది తన చెయ్యి అతడి శిరస్సుమీద ఉంచి "విజయోస్తు... శుభమస్తు" అని ఆశీర్వదించింది. పరిచారికలు భయంతో తల్లడిల్లిపోయారు. ఇదేమి ఆజ్ఞ? ఈ పరిస్థితిలో రాజకుమారుడు యుద్ధం చేయగలడా? ప్రాణాలకే అపాయమురావచ్చును కదా?

పూరుడు నమస్కరించి "మీ ఆశీర్వాదమే నాకు కోటి యవ్వనాల బలం. ఇప్పుడే యుద్ధరంగానికి పోతున్నాను" అని బయలుదేరాడు.

యుద్ధరంగంలో పరమవృద్ధుడై సేనా ముఖాన నిలిచిన పూరుణ్ణి చూసి శత్రువులు పరిహాసంగా నవ్వుకున్నారు. విల్లు ఎక్కుపెట్టటానికీ, బాణం గురి చూడటానికీ పూరుడు చాలా శ్రమపడవలసి వచ్చింది. ఈ లోగా శత్రువుల బాణాలు అతడి శరీరాన్ని తూట్లు పడేలా పొడిచాయి. పూరుడు చలించలేదు. ఎక్కుపెట్టిన విల్లు దించలేదు. మనసులో తల్లిని ధ్యానించుకొని గురి కుదిరిందో లేదో పరిశీలించకుండానే బాణం వదిలాడు. ఆ తరువాత ఒకటి– ఆ తరువాత మరొకటి - శత్రువులలో హాహాకారాలు– పూరుడి సేనలో నవచైతన్యం – ఆహాకారాలు వింటున్నకొద్దీ పూరుడిలో ఉత్సాహం పెల్లుబికింది. నవచైతన్యం ఆవహించింది. గురి చక్కగా కుదరసాగింది పూరుడు ప్రళయరుద్రుడై విజృంభించాడు. శత్రుసేనలు సంఖ్యలో అధికమైనా అతడి ధాటికి, అతడి దివ్యాస్త్రాల ధాటికి – ఆగలేకపోయాయి. ఆ సాయంత్రానికే శత్రుసేనలను తరిమితరిమి కొట్టాడు – దేశమంతా పూరుడికి జేజేలు పలికింది విజయధ్వానాల మధ్య శర్మిష్ఠభవనం చేరుకొన్నాడు. పరమానందంతో తల్లిని చూడాలని వచ్చిన అతడికి శర్మిష్ఠ తెలివితప్పి పడిపోయి కనిపించింది. పసిపిల్లవాడిలా "అమ్మా! అమ్మా!" అని పిలిచాడు ఆర్తిగా. శర్మిష్ఠ కళ్ళు విప్పింది. అప్పటివరకూ ఎన్ని వైద్యాలు చేసినా ఆమెకు తెలివి తెప్పించలేకపోయిన వైద్యుల ముఖాలు వికసించాయి. శర్మిష్ఠ కళ్ళు విప్పగానే వారు ఆమెతో మందులు త్రాగించారు. బలాన్నిచ్చే పానీయాలు తాగించారు. కొంతసేపటికి నిద్రనుంచి లేచినదానిలా లేచి కూచుంది, శర్మిష్ఠ.

"నాయనా! ఎంత కఠినమైన ఆజ్ఞ విధించాను నీకు? తల్లిదండ్రులమయిన మేమిద్దరమూ నీకు కష్టాలనే కలిగిస్తున్నాము." అంది

"లేదమ్మా! మీ ఆశీర్వాదబలం వల్ల నేను జయంపొందాను– సమయానికి నాకు ధైర్యం కలిగించి మన దేశాన్ని మీరే కాపాడారు"

తన శిరస్త్రాణమూ, కవచమూ, కాలికున్న ఇనుప పాదరక్షలూ, చేతులకున్న బంగారు తొడుగులూ, అన్నీ తీసినాడు పూరుడు. అతడిని నివ్వెరపోయి చూస్తూ "నాయనా! ఇదెక్కడి వింత?" అంది శర్మిష్ఠ.

"ఏమిటమ్మా!"

"ఇటురా!" కొడుకు చెయ్యి పట్టుకొని,



## ఇంద్ర సింహాసనం

మణి దర్పణం ముందు నిలబెట్టింది. తన ప్రతిబింబం చూసుకొని పూరుడు కూడా నివ్వెరపోయాడు, అతడు తన పూర్వ యవ్వనంతో ఉన్నాడు.

"అంతా మహాదేవి దయ." అని అత్యంతానందంతో కొడుకు శిరసు నిమిరిన శర్మిష్ఠ అంతలో భయంతో "ఒక వేళ మీ తండ్రి గారికి......" అని ఆగిపోయింది.

"లేదమ్మా! అలా జరగదు. యుద్ధ సమయంలో నేనొక్కసారి కూడా తండ్రిగారి యవ్వనం నాకు రావాలని అనుకోలేదు. నా మనసంతా "శత్రువులను ఎలా నాశనం చెయ్యటమా" అనే ఆందోళనతోనే నిండి ఉంది. మన దేశాన్ని ఎలా అయినా కాపాడుకోవాలనే ఆరాటం తప్ప నాకు మరో ఆలోచన రాలేదు. ఆ సమయంలో నేను ధ్యానించింది నిన్ను మాత్రమే! నీ ఆశీర్వాదం తలచుకొంటే నాకు కొత్త బలం వచ్చినట్టయ్యేది."

ఆంతరంగిక పరిచారిక వచ్చి "అమ్మా! నారద మహాముని వచ్చారు" అంది పూరుడు సంభ్రమంగా ఎదురు వెళ్ళి నారదమునిని సగౌరవంగా ఆహ్వానించాడు. శర్మిష్ఠ నమస్కరించి మహామునికి ఆసనం చూపి, అతడు కూర్చొన్నాక, తను కూర్చుంది. నారదముని కనుసైగ చేశాక అప్పుడు కూర్చున్నాడు పూరుడు.

"యుద్ధంలో ఘన విజయాన్ని సాధించావని విని అభినందించటానికి వచ్చాను." అన్నాడు నారదుడు పూరుడితో. "అంతా తమదయ." అని నమస్కరించాడు పూరుడు. శర్మిష్ఠ "ఆందోళనతో మహామునీ! కుమారుడికి యవ్వనం తిరిగివచ్చింది. అక్కడ మహారాజు ఎలా ఉన్నారో అని భయంగా ఉంది." అంది.

నారదముని చిరునవ్వుతో "మహారాజు క్షేమంగా యవ్వనంతో ఉన్నారు తల్లీ! తన తపశ్శక్తితో శుక్రుడి శాపాన్ని జయించాడు పూరుడు" అన్నాడు.

"తపశ్శక్తితోనా ?"

"అవునమ్మా! తపస్సంటే ఏమిటి? అరణ్యాలలోకి పోయి చేసే ధ్యానం మాత్రమే కాదు. ఒక ధ్యేయంతో చేసే ఏకాగ్రమైన సాధన. ఈ సాధనకు నైతికబలం తోడయింది పూరుడికి. తన దేశాన్ని కాపాడుకోవాలనే

# అసలైన చెక్కతో చేసిన క్యాబినెట్లు శ్రావ్యమైన ధ్వనిని యిస్తాయి...

## మర్ఫీ వారు సరి కొత్త టేబుల్ మోడల్స్‌కి అసలైన సిసలైన చెక్కతో చేసిన క్యాబినెట్లు వాడి మీకు అందిస్తున్నారు!

murphy MATADOR

murphy MAIDEN DELUXE

SAA/MR/1589 G/RR/TL

చెక్క అన్నది నిజానికి గొప్ప వస్తువు — ముఖ్యంగా స్పష్టమైన, శ్రావ్యమైన ధ్వని విషయంలో. మర్ఫీ యొక్క టేబుల్ మోడల్స్ శ్రేణిలోని ప్రతి సెట్టూ యొక్క కేబినెట్, కౌశల్యంతో కూడిన వృత్తి నైపుణ్యంగల వారి చేతులతో, అసలైన చెక్కతో చేయబడుతుంది. ఈనాడు మిగతా ఏ రేడియోలలో కనిపించని విశేషం యిది దీనిలో.

**మర్ఫీ**

*ఇంటిలో అందరి ఆహ్లాదమునకు!*



# భూమిచుట్టూ తిరిగే రోదసీ మందిరం

భూ ప్రదక్షిణలు చేసే శాశ్వత "రోదసీ నిలయా"న్ని అమెరికా ప్రయోగిస్తుందని వ్యోమగాములు జాన్ యంగ్, రాబర్ క్రైపెన్ చెప్పారు.

స్పేస్ షటిల్ కార్యక్రమం పరంగా జరిగిన తొలి కొలంబియా అంతరిక్ష రవాణా నౌక ప్రయోగంలో వీరిద్దరూ ఏప్రిల్ 12-14 తేదీలలో ఆ నౌకలో ప్రయాణం చేసి వచ్చారు.

ఆధునిక శాస్త్ర సాంకేతిక యుగంలో అమెరికా ముందడుగు వేయాలంటే శాశ్వత వ్యోమ కేంద్రాన్ని ఏర్పరచుకొనటం ఎంతైనా అవసరం అని, అమెరికా ప్రతినిధుల సభ తాలూకు శాస్త్ర-సాంకేతిక ఉప సంఘం ఎదుట వీరు చెప్పారు

భూమి చుట్టూ తిరిగే 'స్పేస్ స్టేషన్'లో ఎల్లప్పుడూ మనుషులు ఉంటారు ఈ శాశ్వత వ్యోమ కేంద్రంలో మనుషుల నివసించటానికి అన్ని వసతులు గల ఒక ప్రత్యేక గృహం, ఒక వర్క్‌షాపు, ఒక శాస్త్ర, సాంకేతిక పరిశోధనాలయం, కమ్యూనికేషన్ స్విచ్ బోర్డులాంటి పెద్ద పెద్ద సాధనాలను, యంత్రాలను నిర్మించుకొనే వసతుల ఉంటాయి

అమెరికా వ్యోమ పరిశోధన సంస్థ (నాసా) ఇలాంటి స్పేస్ స్టేషన్ గురించి 1960 లోనే పరిశీలనలు ప్రారంభించింది అయితే, 1969 నుంచి అంతరిక్ష రాకపోకల వాహనాన్ని ప్రయోగించే పథకానికి ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వటం జరిగింది దీని ఫలితమే "స్పేస్ షటిల్" కార్యక్రమం.

1980, 1990 దశాబ్దాలలో అమెరికా అంతరిక్ష పరిశోధన కార్యక్రమ లక్ష్యాలను గురించి కాంగ్రెసు (అమెరిక పార్లమెంట్) సభ్యులు అడిగిన ప్రశ్నలకు జవాబు చెబుతూ, యంగ్, క్రైపెన్, తాము కొలంబియా ద్వారా జరిపిన వ్యోమ యాత్ర భూలోకవాసుల అంతరిక్ష ప్రయాణాలకు నాంది పలుకుతుంది, అని అన్నారు.

'కొలంబియా' తొలి ప్రయాణం, సాహసోపేతమైన అద్భుత సంఘటన, అని కాంగ్రెస్‌మన్ లేరీ విన్, జూనియర్ అన్నారు

ఈ యాత్రను గురించి తయారు చేసిన ఒక చలన చిత్రాన్ని గురించి వివరిస్తూ, వ్యోమగామి యంగ్ కొలంబియాలోని ప్రక్రియలన్నీ అద్భుతంగా పని చేసినట్లు చెప్పారు ఈ వ్యోమ నౌక తిరుగు ప్రయాణంలో భూ వాతావరణంలో ప్రవేశించినప్పుడు చాలా సున్నితంగా ప్రయాణం సాగించటం ఒక అద్భుత విశేషం అని యంగ్ చెప్పారు. "ఇలాంటి యంత్రాన్ని సృష్టించటం సాధ్యమా అని, నాకు అనిపించింది" అని ఆశ్చర్యం వెల్లడించారాయన.

యంగ్, క్రైపెన్‌లకు వాషింగ్టన్‌లో ఫెడరల్ ప్రభుత్వం వివిధ శాఖలు సన్మానించిన సందర్భంలో కాంగ్రెసు సభ్యుల వివిధ అంశాలపై వీరిని ప్రశ్నించారు

వీరి వాషింగ్టన్ యాత్ర మే 19 న వీరి గౌరవార్థం ప్రెసిడెంటు జరిపిన విందుతో ప్రారంభమైంది.

ప్రెసిడెంటు చేసిన ఈ విందుకు, ఇంతకుముందు, మెర్క్యురీ, జెమినీ, అపోలో, స్కైలాబ్ వ్యోమ నౌకలలో అంతరిక్ష యాత్ర చేసిన 40 మంది వ్యోమగాములను కూడా ఆహ్వానించారు ఈ సందర్భంలో ప్రెసిడెంటు రేగన్ ప్రసంగిస్తూ "స్వతంత్ర ప్రజలమైన మనం ఎంతటి ఘనకార్యాన్నయినా సాధించగలమని కొలంబియా యాత్ర రుజువుచేసింది మన శక్తి సామర్థ్యాలను ఎవరూ ఆపలేరు ఎంత దూరంలో ఉన్న గ్రహాన్ని అయినా మనం అందుకోగలం" అని వక్కాణించారు. [ ఇవరీ ప్రిస్కాల్ ]

## ఇంద్రసింహాసనం

నిస్వార్థమైన పవిత్రమైన ధ్యేయం అతడిది ఏనాడూ అరణ్యాలకు పోకపోయినా, నిరంతరమూ తన మనసులోని స్వార్థాన్ని సంకుచితత్వాన్ని అణచివేస్తూ, ఉదాత్త ప్రవృత్తులను జాగృతంచేసుకొనే అతడి జీవితమే ఒక తపస్సు ఈమహాశక్తి ముందు స్వార్థపూరితమైన శుక్రుడి తపశ్శక్తి ఏమాత్రం ? మొదట పూరుడిలో ఆ శాపాన్ని ఎదుర్కోవాలనే సంకల్పం కలగలేదు మౌనంగా స్వీకరించాడు అందుకే కొంతకాలం వృద్ధాప్యం అనుభవించాడు తన దేశాన్ని రక్షించుకోవాలనే తపనలో అతని సంకల్పశక్తి జాగృతమయింది ఆ శక్తి ముందు శాపంపటాపంచలయింది "ఆశ్చర్యంగా వింటున్న శర్మిష్ఠ "ఆహా! ముంచుకొచ్చిందనుకొన్న ఆపద కూడా మంచికే వచ్చిందన్న మాట!" అంది "ఆత్మబలం ఉన్నవారికి ఆపద అనేది లేదమ్మా! జీవితంలో ఒడుదుడుకులకు భయపడకు. ఎంతటివారికైనా అవి తప్పవు."

"నా కష్టాలకు నేను భయపడలేదు. బాధపడలేదు నా కారణంగా నా వారికి కష్టాలు కలిగినప్పుడు మాత్రం పరితపిస్తున్నాను ఇప్పుడైనా నేను దేవిని ప్రార్థిస్తున్నది, నా తప్పులకు నన్ను శిక్షించి నా వారిని దయచూడమని......"

"అందుకే నీ ఆశీర్వాదం నీ బిడ్డకు కొండంత అండగా నిలబడి విజయం చేకూర్చింది వృద్ధాప్యంలో ఉన్న నీకొడుకు యుద్ధానికి వెళితే అతని ప్రాణాలకు ఎంత ప్రమాదమో తెలిసినా, దేశాన్ని రక్షించమని ఆశీర్వదించి పంపిన వీరమాతవు నీవు నీకొడుకు వంశకర్త అవుతాడు - అతడి చరిత్రను భారతజాతి ఎప్పటికీ కీర్తిస్తూనే ఉంటుంది"

పూరుడినీ, శర్మిష్ఠనూ ఆశీర్వదించి వెళ్ళిపోయాడు నారదుడు.

(ఇంకా ఉంది)

## "టెన్నిస్" వీరుల మధుర స్వప్నం

# "వింబుల్డన్ పోటీ"ల కథ!




విహంగావలోకనంలో వింబుల్డన్ 'కోర్టు'లు

**అంతర్జాతీయ క్రీడారంగంలో వింబుల్డన్ పోటీలకు ఒక ప్రత్యేక స్థానమున్నది. ఈ అత్యుత్తమమైన టెన్నిస్ పోటీ పదవిని గెలవాలని ప్రపంచంలోని ప్రతి టెన్నిస్ ఆటగాడు ఆటకత్తె ఉవ్విళ్లూరుతుంటారు.**

ఈ పోటీలలో ఆర్జించే "ప్రైజ్ మనీ" కన్నా వింబుల్డన్ పేరు ప్రఖ్యాతులకే చాలా ప్రాధాన్యం ఉన్నది!

ఇంగ్లండులో 1870 ప్రాంతాల్లో టెన్నిస్ ఆటను ప్రవేశపెట్టారు వెంటనే ఈ క్రీడ ప్రామర్యం పొంది మిగతా ఆటలను వెనుకకి త్రోసింది

## తొలి విజేత!

1877లో మొట్టమొదటి టెన్నిస్ టోర్నమెంటు నిర్వహింపబడింది అందులో కేవలము ఇరవైఇద్దరు ఆటగాళ్లు పాల్గొనగా "స్పెన్సర్ గొర" అన్న ఇంగ్లీషు ఆటగాడు నెగ్గి తొలి వింబుల్డన్ విజేత ఘనతను సంపాదించాడు.

1884 లో స్త్రీలకు కూడ పోటీలు మొదలెట్టారు. వార్పల్ రోడ్‌లో జరిగే ఈ పోటీలకు స్థలం ప్రేక్షకుల ఒత్తిడి ఎక్కువ కావడంతో సరిపోలేదు. అందుచేత 1922లో ప్రస్తుతం వింబుల్డన్ టెన్నిస్ క్రీడలు నిర్వహించబడుతున్న వింబుల్డన్ అనేచోట సరికొత్త స్టేడియం నిర్మించారు. ఇందులో దాదాపు 15 వేల మందికి సరిపడే "సెంటర్ కోర్టు", ఆరువేల మందికిపైగా సరిపడే నంబర్ వన్ కోర్టు నిర్మించారు ఇవిగాక 13 ఇతర కోర్టులు కూడ వున్నాయి ఇవన్నీ దట్టమైన గడ్డి మొత్త కోర్టులు [లాన్ టెన్నిస్ కోర్టులు] ఈ కోర్టులలో టెన్నిస్ బంతులు అమిత వేగంగా ఎసురుతాయి ఆటగాళ్ల చాకచక్యానికి, దేహసౌష్టవానికి, సమయస్ఫూర్తికీ ఈ బంతి వేగం కూడ ఒక పరీక్ష

## నిబంధనల మార్పు

స్టేడియం మార్పుతోపాటు క్రీడా నిబంధనలు కూడ మార్చారు 1921 దాకా ఒకసారి టోర్న

★ వింబుల్డన్ ఒక పెద్ద టెన్నిస్ క్రీడా కేంద్రమేకాక పేరెన్నిక గన్న ఒక ఫ్యాషన్ సెంటరు కూడ బ్రిటన్, ఇంకా ఐరోపా, అమెరికా దేశాల నుంచి అనేక ధనికులు ఈ పోటీలు జరిగే 2 వారాలు ఇక్కడే గడుపుతారు చక్కగా నిర్మించిన విశాలమైన కోర్టులు, 200 మందికి పైగా అంపైర్లు, 1200 పైగా వాడబడే బంతులు, 5,93,117 డాలర్లకు పైగా బహుమతి ధనం, సాటిలేని ఆటగాళ్లు – వీటన్నిటితో వింబుల్డన్ టెన్నిస్ టోర్నమెంటు దానికదే సాటి!

[శ్రీ ఆలీ అక్బర్ టెన్నిస్ వ్యాఖ్యాత]

**అగ్రశ్రేణి టెన్నిస్ ఆటగాడికి 'వింబుల్డన్'కి అర్హత సంపాదించడమే – ఒక పరమ పద సోపానం .... క్రీడా ప్రియులకి వింబుల్డన్ నేరుగాపోయి చూడటం కన్నా అదృష్టం మరోటి వుండదు.... 'వచ్చే ఏడాదికి యీ ఏడాది నుంచే టిక్కెట్ కొని రిజర్వ్ చేసుకుందాం' అన్నంత తహతహ ప్రపంచ టెన్నిస్ క్రీడాభిమానులలో కలిగించిన "వింబుల్డన్' టోర్నమెంట్ లు యీ ఏడాది ఉత్కంఠభరిత వాతావరణంలో మొదలవుతున్నాయి.**

మెంటులో నెగ్గినవాడు ఆ తరువాత పోటీల్లో ఫైనల్సు మాత్రమే ఆడేవాడు. 1922 నుంచీ విజేత కూడ మొదటి రౌండు నుంచి ఆడాలన్న నిబంధన అమలులోకి వచ్చింది.

కాని 1924 నుండి ప్రముఖ ఆటగాళ్ళు మొదటి రౌండులో తారసల్లకుండా సీడింగ్ పద్ధతి ప్రవేశపెట్టబడింది. అప్పటి నుండి నేటి వరకు ఇదే పద్ధతి అమలులో వున్నది. వింబుల్డన్ సీడింగ్ పొందిన మొదటి భారతీయుడు "దిలీప్‌బోస్" వింబుల్డన్ సీడింగ్ పద్ధతిలో చెప్పుకోదగిన ఒక ప్రత్యేకత ఉన్నది. మొదటి సీడింగులున్నవారికి చెరొక భాగములో ఉంచి తక్కినవాటిని "లాట్స్" వేసి చెరొక భాగములో వుంచుతారు. మరొక వింబుల్డన్ విశిష్టత ఏమిటంటే ఇతర ప్రముఖ టోర్నమెంటులోవలె మూడు సెట్ల తర్వాత పది నిముషముల విరామముండదు. అయిదు సెట్లు వరుసగా ఆడవలసిందే. దీనివల్ల ఆటగాళ్ల నైపుణ్యం మాత్రమేగాక బలము "దమ్ము" కూడ పరీక్షింప బడుతాయన్న మాట.

## పుష్పక విమానం కాదు!

వింబుల్డన్‌లో పురుషుల సింగిల్స్‌లో 128, మహిళల సింగిల్స్‌లో 96 కు పరిమితి చేయబడతాయి. మెయిన్ డ్రాలో రావాలంటే ఆటగాళ్ళు క్వాలిఫయింగ్ రౌండ్స్ ఆడి నెగ్గిరావాలి! ఈ ఆట తొలి రోజుల్లో బ్రిటిష్ అమెరికన్ ఆటగాళ్ళు మాత్రమే నెగ్గుతూ ఉండేవారు. వింబుల్డన్‌లో మంచి నైపుణ్యము చూపి అఖండ కీర్తిని ఆర్జించిన మొదటి అమెరికన్ ఆటగాడు బిల్ టిల్డన్. ఈయన 1920–21 లోను ఆ తర్వాత 1930 లోను గెలిచాడు. నేటికీ టిల్డన్ ఆటను గురించి ఎంతో గౌరవంగా చెప్పుకుంటారు.

ఫ్రెంచి ఆటగాళ్ళు బరోత్ర, లాకోస్ట్, "కోషెట్" 1924 నుండి 1929 వరకు నెగ్గుతూ వచ్చారు. బ్రిటిష్ ఆటగాడు ఫ్రెడ్ పెర్రి 1934 నుండి వరుసగా మూడు సంవత్సరములు నెగ్గి అప్పట్లో ఒక రికార్డును సృష్టించాడు. ఆ తర్వాత ఏ ఇంగ్లీషు ఆటగాడు వింబుల్డన్ ఇంతవరకు నెగ్గలేదు.

## మహిళల ప్రతిభ !

మహిళలలో ఫ్రెంచి ఆటకత్తె సుజాన్ లెంగ్లెన్, అమెరికన్ ఆటకత్తె "హెలెన్ విల్స్‌మూడీ" చాలాసార్లు నెగ్గి అఖండ కీర్తిని సాధించారు. అమెరికన్ ఆటకత్తె మారిన్‌కానోలి వరుసగా మూడుసార్లు నెగ్గి ఘనత సంపాదించింది. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత 1945 లో వింబుల్డన్ టెన్నిస్ పోటీలు పునఃప్రారంభించబడ్డాయి. అప్పటినుంచి ఈ ఆటలో అమెరికా, ఆస్ట్రేలియా ఆటగాళ్ళు ముందుకొచ్చారు.

వింబుల్డన్ పోటీలో నెగ్గి కీర్తి కిరీటాన్ని పొందాక ధనార్జన కోసం వాళ్లంతా ప్రొఫెషనల్స్ (వృత్తి క్రీడాకారులు)గా మారేవారు. అందుచేత 1968 నుంచి వింబుల్డన్ ఓపెన్ టెన్నిస్ టోర్నమెంటుగా అందరికీ ప్రవేశం కల్పించబడినది. ఆస్ట్రేలియా ఆటగాడు రాడ్ లేవర్ మొట్టమొదట ఓపెన్ టోర్నమెంటును నెగ్గాడు. ఇతర టోర్నమెంటుల్లో అమిత ప్రఖ్యాతిని పొంది వింబుల్డన్ నెగ్గని క్రీడాకారులు ఉన్నారు.



# ఆంధ్రసచిత్రవారపత్రిక

## రచయితలకు గమనికలు

★ ఆంధ్ర సచిత్ర వారపత్రికకు కథలూ ఇతర రచనలు పంప దలచుకున్నవారు సంపాదకుడు ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీ నగరం, విజయవాడ–520 003 అన్న చిరునామాకి వ్రాయాలి.

★ కవరు మీద శీర్షిక పేరు పేర్కొ వడం మంచిది రచయితలు తమ పూర్తి పేరూ చిరునామా రచన చివర కూడా స్పష్టంగా వ్రాయాలి– హామీ పత్రం జత చెయ్యాలి.

★ గేయాలు తిప్పి పంపబడవు. వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం.

★ కథలుగాని, ఇతర రచనలుగాని త్రిప్పి పంపబడాలని కోరుకునే వారు– వారి స్వంత చిరునామా గల తగినన్ని తపాలాబిళ్లు అంటించిన కవరు పెట్టడం అవసరం.

★ రచనల గురించి పంపిన వెంటనే గాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటిపై విచారణ కోసం ఎదురుచూడడం మంచిది. రచనల గురించి ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు కానీ–తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయ వలసివస్తే రచయితలు– రచన పేరు – అది పంపిన తేదీ, వివరంగా వ్రాయుండే, వాటి గురించి పరిశీలించడం కష్టం.

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామా గల తగినన్ని తపాలా బిళ్ళ అంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది.

★ కార్టూన్లు పంపేవారు కూడా 8 వారాలలోగా మా మీద ఉత్తరాల దాడి చెయ్యకూడదు.. ప్రతి కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్ల కవర్ పై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ కార్టూన్ల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలు వెంబడి జరుగుతుంది.

★ రచయితలకు కార్టూనిస్టులకు ఒక్క ఉత్తరాలు. ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పద్మ' వారికి తప్ప తతిమ్మా అందరికీ; అవి పద్మ "ప్రతు"లు– కాల క్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము. కాపీలు టపాలో పోయే ప్రమాదం వుండే తప్ప పంపకపోవడం జరుగదు. సం.

# "టెనిస్ మక్కా" వింబుల్డన్

ఆస్ట్రేలియాకు చెందిన రోజ్‌వాల్ పాపం! నాలుగుసార్లు ఫైనల్స్‌కు వచ్చి ఒక్కసారీ నెగ్గలేదు అలాగే 1969లో అమెరికన్ ఆటగాడు "గాంజలెస్" తన శిష్యుడైన పాసరెల్‌తో 112 గేములు – రెండు రోజులు ఆడి వింబుల్డన్ చరిత్రలో అతి దీర్ఘమైన మ్యాచి ఆడిన ఘనత పొందాడు. ఈ పోటీలలో శ్వేతేతర జాతీయులు – పురుషులలో ఆర్థర్ ఆషే, మహిళలలో ఆల్తియా గిబ్సన్, బిల్లీజీన్ కింగ్‌లు.

## బోర్ ఘనత!

ఇరవై వింబుల్డన్ పదవులను ఏకైక టెన్నిస్ ప్లేయర్ స్వీడన్ ఆటగాడు బోర్గ్ 1976 నుంచి నేటివరకు అయిదుసార్లు వరుసగా ఈ పోటీని గెలుచుకొన్నాడు. మళ్లీ ఆయన ఈ సంవత్సరం నెగ్గినా ఆశ్చర్యం లేదు – అప్పుడే 'ఫ్రెంచి' టోర్నమెంట్‌ను బోర్గ్ ఘనంగా నెగ్గాడు

## భారత్ కీర్తి!

వింబుల్డన్ పోటీలలో ఇంతవరకు ఏ భారతీయుడు ఆ మాటకొస్తే ఏ ఆసియా ఆటగాడు నెగ్గలేదు ఇందులో క్వార్టర్ ఫైనల్స్ దాకా చేరిన మొదటి భారతీయుడు గౌస్ మొహమ్మద్ 1939లో అతను క్వార్టర్ ఫైనల్స్‌లో అంతిమ విజేత అయిన రిగ్స్ చేతిలో ఓడిపోయాడు ఆ తరువాత రామనాథన్ కృష్ణన్ 1960లోను, 1961లోను వరుసగా రెండుసార్లు సెమిఫైనల్స్ చేరి సంచలనం సృష్టించాడు 1973లో విజయ్ అమృత్‌రాజ్ క్వార్టర్ ఫైనల్స్‌లో మంచి ఆధిక్యతలో వుండికూడ కొడెజ్ చేతిలో ఓడిపోయాడు 1954లో రామనాథన్ కృష్ణన్ జూనియర్ వింబుల్డన్ పదవిని గెలుచుకోగా తిరిగి 25 సంవత్సరాలకు 1979లో ఆయన కుమారుడు రమేష్ అదే పదవిని గెలుచుకున్నాడు వింబుల్డన్ చరిత్రలో ఇదొక మరపురాని మధురస్మృతి తండ్రీ కొడుకులు ఒకే పదవిని నెగ్గడం జూనియర్ వింబుల్డన్ పోటీలలో ఒక విశేషము ఇక డబుల్స్‌లో నరేష్ కుమార్ కృష్ణన్‌ల జంట మంచి ప్రదర్శనలిచ్చారు 1976లో అమృత్‌రాజ్ సోదరులు డబుల్స్ సెమిఫైనల్సుకు చేరుకున్నారు ఈ యేడు పోటీలు జూన్ 22 నుంచి మొదలవుతాయి అనుకూలమైన డ్రా, కొంచెము అదృష్టముంటే విజయ్, రమేష్ చాలావరకు రావొచ్చు —




(గత సంచిక తరువాయి)

రమ్య కూరగాయలు తరుగుతూంది. ప్రక్కింట్లో సుగుణక్క వాంతి చేసుకోవడం వింటూనేవుంది. పొద్దున లేచిన దగ్గరనుండి ఇది మూడోసారి.

తనకు ఒకటి రెండుసార్లు అయ్యాయి. అంతే! మరి కాలేదు – కాని భోజనం సహించడం లేదు. మార్నింగ్ సిక్‌నెస్‌తో అంత బాధలేదు. కొందరు వేవిళ్ళతో మంచం పట్టేస్తారంట. విసిగిపోతారు. ఏం తిన్నా నిలవదు.

"మన పాపాయి మంచిది – కదూ!" అని రమ్య కడుపుమీద చెయ్యి వేస్తే "అవును. అంతా నాన్నగారి పోలికే" అంటూ నవ్వేది. ప్రక్కింట్లో సుగుణక్క 'యాక్... యా ..క్" అని వాంతి చేస్తుంటే ఇక నిలవలేకపోయింది. తరుగుతున్న కూరగాయలు ప్రక్కన పెట్టి చేతులు కడుక్కుని తుడుచుకుంటూ వెళ్ళింది. బాత్‌రూమ్ లోపల ఏదో చోద్యం చూస్తున్నట్లు కళ్ళు విప్పారించి చూస్తోంది సుగుణక్క. సుగుణక్క రాయిలా నిలుచుంది. మరింతసేపు వాంతి చేసుకుంటోంది ఎవరబ్బా!

ఆపసోపాలు పడుతూ, వెంకట్రావుగారు వచ్చారు. నడుంమీది చేతులు పెట్టుకుని – నడవ లేనట్లుగా వచ్చి మంచంమీద పడుకున్నారు.

"రమ్యా! ఇదీ వరస" అంటూ వెంకట్రావు ముఖం తుడుస్తూ "నాకు కడుపు అయితే మీకు వేవిళ్ళేమిటండీ – ఇదేదో విచిత్రంగా వుందే! డాక్టరుకు చూపించుకోకూడదూ..." ఇది ఎంత దూరం తీస్తుందో, అని వర్రీగా వుంది సుగుణక్క.

రమ్య నిమ్మరసంలో కాస్త ఉప్పు, గ్లూకోస్ కలిపి తెచ్చింది గడగడ తాగేసి పడుకొని ఆరాటం తీర్చుకోసాగాడు వెంకట్రావ్. రమ్య నవ్వు ఆపుకుంటూ ఫ్యాన్ వేసి వచ్చింది. ఆ రోజునుంచి తన కడుపు సంగతి దాదాపు మర్చిపోయింది. ప్రక్కింటి వింత వినోదంగా చూసేది. వెంకట్రావ్‌లో రోజు రోజుకు కలుగుతున్న మార్పులు గమనిస్తూ ఎప్పటికప్పుడు శ్రీకాంత్‌కి చెప్పేది. ఇద్దరు గట్టిగా కౌగిలించుకొని నవ్వుకునేవారు. వారి నవ్వు ప్రక్కింటి వారు వింటారేమోనని, అనుకుంటే ఇంకా, ఇంకా గిలిగింతలు పెట్టినట్లు నవ్వు కలిగేది.

శ్రీకాంత్ ఫ్యాక్టరీకి పోడానికి తయారవుతున్నాడు.

"శ్రీకాంత్!" అని పిలుస్తూ వచ్చి వెంకట్రావ్, వరండాలో నిలుచున్నాడు. తలమీద టవలు వేసుకున్నాడు – ఎప్పుడు షర్టు లోపలికి టక్ చేస్తాడు – వెనకాల దోపుకున్నాడు కాని – ముందు దోపుకోను మరిచిపట్లున్నాడు – పొట్ట ముందుకు పొడుచుకువచ్చినట్లుంది. కాళ్ళు వెడంగ పెట్టి నడుంపైన చేతులు పెట్టుకుని నిలుచున్నాడు.

వస్తున్న నవ్వు ఆపుకుంటూ "కాంతి! బావగారు వచ్చారు" అని చెప్పుతూ – తాను వరండాలోకి వచ్చి "కూర్చోండి బావగారు" అని మర్యాద చేసింది. శ్రీకాంత్ చొక్కాకి గుండీలు పెట్టుకుంటూ వచ్చాడు.

"శ్రీకాంత్! అలా వెళ్దాం వస్తావా" అన్నాడు నెత్తిన వేసుకున్న టవలు తీసుకుని – ముఖాన్ని తుడుచుకుంటూ – శ్రీకాంత్ రమ్య వైపు చూశాడు. వెళ్ళిరండి అన్నట్లుగి తల వూపింది.

ఇంటికి దగ్గర్లో వున్న హోటల్లోకి వెళ్ళి ఫామిలీ రూంలో కూర్చున్నాడు వెంకట్రావ్. పెసరట్టులో – మిరపకాయలు ఎక్కువ వేసి, వుప్మాలో కాస్త నిమ్మరసం కాస్త ఎక్కువగా పిండి, తెమ్మని, ఆర్డర్ ఇచ్చాడు. రెండు ప్లేట్లు ఆర్డర్ ఇస్తుంటే–వద్దని శ్రీకాంత్ చెప్తున్నా వినిపించుకోలేదు.

"శ్రీకాంత్! నీకెవరైనా డాక్టర్లు తెలుసా ?"

"డాక్టర్లు ప్రత్యేకంగ తెలియనవసరంలేదు వారి దగ్గరకు వెళ్ళి, నేరుగ మన జబ్బు చెప్పి, మందు తీసుకోవచ్చు–వదినగార్ని చూపించాలా!..."

"మీ వదిన సంగతి కాదు -- నేనే చూపించుకోవాలి. దానికి గర్భం అయితే నాకు వేవిళ్ళేమిటి! నా కడుపులో అదోమాదిరిగా వుంది. ఏవేవో కోరికలు - పైగా, కడుపుకూడా పెరుగుతున్న అనుమానంగా వుంది. నాకేదో భయంగా వుంది కాంతూ" అంటూ శ్రీకాంత్ రెండు చేతులు గట్టిగా పట్టుకుని "నీవే నాకు దిక్కు! డాక్టర్ దగ్గరకు పోవాలంటే సిగ్గుగా వుంది. నిజంగా నాకు కడుపే అనుకుందాం – బిడ్డ ఎలా పుట్టుతుందీ! అదే భయంగా వుంది —" శ్రీకాంత్ చేతుల్లో ముఖం దాచుకున్నాడు.

ఉధృతంగా వస్తున్న నవ్వును ఆపుకోను కష్టమైపోయింది. పారపోయినా బాగుండును అని అనుకుంటున్న సమయానికి సర్వర్ వచ్చాడు

"ముందు టిఫిన్ కానీయండి! నాకు తెలిసిన డక్టరు వున్నారు. వెళ్ళి కనుక్కుందాం" అంటూ ధైర్యం చెప్పాడు.

"సర్వర్‌బాబు – కాస్త నిమ్మకాయ పచ్చడి తెచ్చిపెట్టు" అని అడిగాడు. నిమ్మకాయబద్ద శబ్దం చేస్తూ చప్పరిస్తూ, "నీ భార్య కడుపుతో వుంది కదా! నీకూ గర్భిణీ స్త్రీకి కలిగేలా కోరికలు ఏమీ లేవా ?" అని కళ్ళు తేలవేసి అడిగాడు.

"నాకూ చేగోడీలు–గులాబ్‌జామ్‌లు, కలకత్తా రసగుల్లాలు తినాలనిపిస్తుంది. కాని నిమ్మకాయ - చింతకాయల్లాంటివి మీలాగ తినాలనిపించటంలేదు." నవ్వును దాచుకుంటూ అన్నాడు. ఇక ఆ రోజుకి ఫ్యాక్టరీకి వెళ్ళినట్లే! అనుకున్నాడు. వెంకట్రావ్ ఇంకా తింటూవుంటే – చూస్తుంటే వాంతి వొచ్చినట్లయింది నోటికి కర్చీఫ్ అడ్డుపెట్టుకుని లేచి వెళ్ళిపోతున్న శ్రీకాంత్ వైపు – అతనికీ వేవిళ్ళు మొదలైనవి – అనుకుంటున్నట్లు– అయ్యో పాపం! అన్నట్లుగ చూశాడు.

హోటల్‌నుండే మేనేజర్‌కి ఫోన్ చేసాడు, సెలవు ఇవ్వమని. కడుపునిండా తిని, గర్భిణీ స్త్రీలా నడుస్తున్న వెంకట్రావుని వెంటబెట్టుకుని ఆటోరిక్షాలో డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళాడు. తల వంచుకు కూర్చున్న వెంకట్రావ్‌ను చూపిస్తూ సిగ్గుపడుతూ, వారికి వచ్చిన అనుమానం గురించి చెప్పాడు.

డాక్టరు కళ్ళు విచ్చుకున్నాయి. వెంటనే, కళ్ళు మూసుకున్నాడు డాక్టరు. బల్లమీద వున్న పేపర్ వెయిట్‌ను తిప్పుతూ ఆలోచనలో పడ్డాడు – ఆ డాక్టరు నవ్వును దాచుకోడానికి చేస్తున్న ప్రయత్నమని శ్రీకాంత్ గ్రహించి అతనుకూడా కళ్ళు మూసుకున్నాడు. అలా కొన్ని నిమిషాలు గడిచాయి.

"చూడు మిస్టర్! యిందులో మీరు భయపడనవసరంలేదు. ఇలాటి కేసులు ప్రత్యక్షంగ చూడలేదు కాని, విన్నాను. కాలం గడిచేకొలది భార్యభర్తలు మాటల్లో, నడవడికల్లో, ఆలోచనాధోరణి, ఒకటే అవుతుంది. ఆలుచిప్పలా – కవలల మాదిరిగ అయిపోతారు మీరు చెప్పినదాన్నిబట్టి, చాలా కాలానికి ఆమెకు గర్భిణి వచ్చింది. ఎప్పుడూ ఆ ఆలోచనతో వున్న వెంకట్రావ్‌గారు అచ్చం భార్యలా ఫీల్ అవడం సహజం. ఒక కన్నుకు నొప్పి కలుగుతే – మరో కంటికి నొప్పి వస్తుంది. దీనిని సింపతిటిక్ పెయిన్ అంటారు. అలాగే మీ భార్యకు వస్తే మీకు వస్తుందని అనుకోవచ్చు. ఇలాటి కేసులు అంటే – భార్యకు గర్భం వస్తే భర్తకు వేవిళ్ళు వచ్చిన సంఘటనలు వున్నాయి."

వెంకట్రావ్ ఆసక్తిగా ముందుకు వంగి వింటున్నారు. కొద్దిగా నిరాశ కనబడింది ముఖంలో--

**జరిగిన కథ—3 :** నాగయ్య, అమరేశ్వరిలకు ముగ్గురు కూతుళ్ళు, ఒక్క కొడుకు విష్ణు. పెద్ద కూతుళ్ళిద్దరు ఉద్యోగాలు చేస్తున్నారు. మూడవ కూతురు రమ్య, ఎదురింటి శ్రీకాంత్ ప్రేమించుకొంటారు. వాళ్ళొకరోజు లేచిపోయి గుళ్ళో పెళ్లి చేసుకొని, కొత్తజీవితం ప్రారంభిస్తారు. ఇంటి యజమాని వెంకట్రావ్ భార్య సుగుణ రమ్యను తన సొంత చెల్లెలుగా చూసుకొంటుంటుంది రమ్యకు గర్భం వస్తుంది. ఈ వార్త పిల్లలు పుట్టని సుగుణకు బాధ కలిగిస్తుంది. కానీ ఆమె కూడా గర్భవతి అవుతుంది.



(తన కడుపులో నిజంగా పాపాయి లేదని చెప్పి నందుకేమో !)

శ్రీకాంత్ లేచి డాక్టరుకు ధన్యవాదాలు చెప్పి, "మీ ఫీజు ... " అన్నాడు.

"నో, నో ! నేనేం చేశాను–ఫీజు తీసుకోను." చెయ్యి ముందుకు చాపి షేక్‌హేండ్ ఇచ్చాడు. వెంకట్రావ్ లేవలేదు. శ్రీకాంత్ నవ్వుకుంటూ, "ఒకసారి–పరీక్ష చేస్తారా! ఎందుకైనా మంచిది..." అని అడిగాడు.

"ష్యూర్! ష్యూర్!" అంటూ వెంకట్రావ్‌ను బల్లమీద పడుకోమన్నాడు, నవ్వుగా ముందుకు పొడుచుకు వచ్చిన అతని కడుపు చూసి ఆశ్చర్య పోయాడు. నిజంగా కడుపులో పాపాయి వుందేమో! వుంటే ఎలా కంటాడు. కడుపులో ఏదో కదిలి నట్లయింది. మైగాడ్ !! అప్రయత్నంగా బెల్టు సరిచేసుకున్నాడు.

శ్రీకాంత్‌ని చూసి "మీ వైఫ్ కూడా ..." అవునంటూ తల వూపాడు. డాక్టరు బిగ్గరగా నవ్వాడు. శ్రీకాంత్ డాక్టరుకు – మరొక్కసారి థాంక్స్ చెప్పి, బయటపడ్డాడు.

* * *

ప్రక్కింట్లో ఎవ్వరో సన్నగా ఏడుస్తున్నారు. రమ్య చేతిలో పని వదలి – పరుగులాంటి నడకతో వెళ్ళింది. మంచంపై పడుకున్న సుగుణక్క నోటికి గుడ్డ అడ్డం పెట్టుకుని ఏడుస్తోంది.

"అక్కా ! ఏమిటి ! ఏమైంది ?" వీపుమీద చెయ్యివేసి రమ్య అడిగింది.

ఏడుపు దిగమ్రింగుతూ "ఇదెక్కడి చోద్యం రమ్యా ! నాకు కడుపైతే మీ బావగార్కి నేవిళ్ళు– రోజు రోజుకు ఆయన ధోరణి చూస్తుంటే భయంగా వుంది. నిజంగా నా కడుపులో బిడ్డ వుందంటావా?"

రమ్య నవ్వేసింది. "ఆటవిక జాతుల్లో భార్యకు గర్భం అయితే భర్తకు నేవిళ్ళు ఉంటాయట – ఎప్పుడు ఒకరిని విడిచి మరొకరు వుండరు. ప్రొద్దున్న లేచింది మొదలు – రాత్రి వరకు కలిసే వుంటారు, కలిసే తిరుగుతారు, కలిసే ఆహారాన్వేషణకు వెళ్తారు. అంత ప్రేమగా వుంటారు. అలాగే మీ మీద బావగార్కి అంత అనురాగం వుంది. అందుకే. బావగార్కి నేవిళ్ళు వచ్చాయి. అలాటి భర్త దొరకడం అదృష్టం. సంతోషించాలే కాని, దుఃఖించకూడదు. అసలే మీరు వట్టిమనిషి కాదు. సంతోషంగా, ఆరోగ్యంగా వుంటే – చక్కని బాబు పుడతాడట" అంటూ సుగుణగారిని పైకి లేపి కూర్చోపెట్టింది.

"అంతేనంటావా ?" అంటూ పైటచెంగుతో ముఖం తుడుచుకుని, లేవలేక లేసి, వంటగదిలోకి వెళ్లి గ్లాసునిండా పళ్లరసం తీసుకువచ్చి, రమ్య చేతికి ఇచ్చింది. మొహమాటం పడుతూ గ్లాసు తీసుకుంది. "మీరు తాగారా !"

"ఆ ..."

"నాకు రోజూ మీతోపాటే పాలు, పళ్లరసం యిస్తున్నారు. మీ ఋణం తీర్చుకోలేను. ఇదే లాస్ట్. రేపటి నుంచి నేను తీసుకోను. ఎప్పుడూ మీరే ఇస్తున్నారు. నేను మీకు ఇచ్చే స్థితిలో లేను. అప్పుడు నాకెంత యిబ్బందిగా వుంటుందో ఆలోచించారా" కళ్ల నీళ్ళు ఆపుకుంటూ అంది.

రమ్య తల నిమురుతూ "రమ్యా ! నేనే నీకు ఋణపడి వుంటాను. ఎంత యిచ్చినా, ఏమి యిచ్చినా నీ ఋణం తీరేది కాదు."

తల ఎత్తి, "సుగుణక్కా ! నేనేమిచ్చాను" అని ఆశ్చర్యం పొందుతూ అడిగింది.

రమ్య ఎదురుగా కూర్చుని "చిన్న దానివైనా, నీ దగ్గర ఎన్నో విషయాలు నేర్చుకున్నాను. భర్తను ఎలా ప్రేమించాలో, ఎలా అనురాగం ఇచ్చి, పుచ్చుకోవాలో తెలుసుకున్నాను. ముఖ్యంగా ఎప్పుడు ఏ విషయాలు చెప్పాలో చర్చించాలో, భర్తను ఎలా తృప్తిపరచాలో, ఫలాన్ని ఎలా పొందాలో గ్రహించాను. ఇదివరకు భర్త ప్రియంగా దరి చేరినప్పుడు–అప్రియమైన విషయాలు మాట్లాడటం చేసేదానను. పని నుంచి రాగానే, దాహం ఇవ్వవలసిందిపోయి, ఇంటి సమస్యలు చెప్పేదాన్ని. ఇప్పుడేవి లేవు. అప్పుడు అత్త మామలు వుండేవారు. ఆడబిడ్డలు, తగవులు, తంటాలు ఓ సంసారంలో ఎన్నో వుంటాయి. ఇంత వరకు భర్తను ఇంటి యజమానిగా, ఇంటిని భార్యను పోషించవలసిన వాడిగానే చూశాను. నేనే ఏదో సుఖాన్ని అతనికి ఇస్తున్నాను. అతనికి నేను అవసరం అన్న తలంపే వుండేది. కాని నిన్ను, నీ చిన్న సంసారం, నీవు నీ కాంతి గురించి పడే తాపత్రయం, అహర్నిశలు అతనిని సంతోష పెట్టటానికి నీవు చేసే ప్రయత్నాలు, సంసారం సర్దుబాటుకు నీవు పడే శ్రమ, నీకు చీరలు, నగలు, సినిమాలు లేవని,

నీవు బాధపడి, అతనిని బాధపెట్టక, మీలో మీరే వినోదం కలిగించుకోవటం, మీరు ప్రేమించుకునే విధానం, నీవు నీ భర్తను ఆకట్టుకునే తీరు, అన్నీ నేను గ్రహించాను. భార్యాభర్తలు శారీరకంగాగాదు — వారి మనస్సులు ఒకటై, ఆత్మలు ఏకమైనవాడు ధైర్యాన్ని పొందుతారని, అనుభవ పూర్వకంగా తెలుసుకున్నాను. మీ భార్యా భర్తలను చూసి మా జీవితాలు ధన్యమైనవి. ఇది ఋణం కాదంటావా...''

''ఏమో ! మా సుగుణక్క పెద్ద పెద్ద మాటలు వాడుతోంది. ఇంకేమీ చెప్పను ... ''

రమ్య తియ్యగా నవ్వింది.

* * *

ఆ రోజు ప్రొద్దుట కాఫీ అందిస్తున్న రమ్యను చూశాడు. గర్భిణీ స్త్రీలాగా లేదు. నడుము ఇంకా సన్నగానే వుంది. ముఖం కళగా వున్నా, శరీరం ఆరోగ్యంగా వున్నట్లు కనపడలేదు. ప్రక్కింటి సుగుణగారు ఆరోగ్యంగా, లావుగా రోజు రోజుకు నిండుకుంటున్న కుండలా వున్న సుగుణగారిని చూసి రమ్యను చూస్తే, రమ్య ఆరోగ్యంగా లేదని స్పష్టంగా తెలుస్తుంది. తన రమ్యకు ప్రత్యేకంగా ఏమి ఇవ్వలేకపోయాడు. తనను ప్రేమించిన భార్యకు ప్రతి ఫలంగా గర్భాన్ని యిచ్చాడు. ప్రతి స్త్రీకిది వరం కావచ్చు. కాని రమ్యకు కాదేమో ! ఇంత త్వరగా గర్భం రావటం మంచిది కాదేమో. ఆర్థికంగా బలపడేదాక ఆగవలసింది. మొదటి కాన్పు. ఇద్దరికి అంతా కొత్తగా వుంది. లోపల భయంగా వున్నా, బయటికి చెప్పరు. ప్రక్కింటి సుగుణగారు వుండ బట్టి సరిపోయింది. రేపో, మాపో ఆమె పుట్టింటికి వెళ్తుంది. అప్పుడు ఎలాగ! ఏమైనాగ రమ్యకు పుట్టింటికి వెళ్ళే ధైర్యం లేదు. ఇటు తనవాళ్ళు, అటు రమ్యవాళ్ళు వారిని పూర్తిగా వదులుకున్నట్లే. మౌనంగా వుండిపోయారు. వారి సంగతి పట్టించుకునే పెద్ద దిక్కు ఎవ్వరూ లేరు.

''సుగుణగారు వెళ్తారు. మరి నీవు ఒక్క దానివైపోతావేమో ...'' అని శ్రీకాంత్ అంటే,

''నా కంటె పెద్దవాళ్ళయిన మాలతి, మాధవిలకు పెళ్ళి కానే లేదు. నేను పెళ్లి చేసుకున్నాను. నాకు పురుడు పోయమ్మా ! అని ఎలా వెళ్లను. అన్నిటికి మీరున్నారు. ఆ పైన భగవంతుడు వున్నాడు. నేను బాగానే వున్నాను'' అంటుంది రమ్య.

రమ్య ఏనాడు ఏమి కోరలేదు. ఏం కావాలి అంటే, మెడ చుట్టూ చేతులు వేసి ''మీలాటి కొడుకు కావా''లంటుంది. అలాంటి రమ్యను గుండెపైన చేర్చుకుంటాడు, అంతకంటే తనేమీ యివ్వలేనట్టు. ఆ రోజు సెలవుపెట్టి రమ్యను ఆసుపత్రికి తీసుకువెళ్లాడు.

డాక్టరు వసుంధర శ్రీకాంత్‌ను చూస్తూనే గుర్తు పట్టింది. గడ్డం క్రింద పుట్టుమచ్చ కోసం చూసింది. గడ్డం వచ్చదనంలో యిప్పుడు స్పష్టంగా ప్రామినెంట్‌గ కనపడడం లేదుగాని చిన్నప్పుడు తెల్లని ముఖంలో అతి సుందరంగా కనిపించేది.

''శ్రీకాంత్ ... టీచర్ బాగున్నారా ? శుభ ఏం చేస్తుంది ? పెళ్లయిందా ?'' అని డాక్టరమ్మ అడుగుతుంటే, శ్రీకాంత్ తెల్లబోయి ఆమెను చూస్తూ ... గుర్తు తెచ్చుకోటానికి ప్రయత్ని స్తుంటే, డాక్టర్ వసుంధర నవ్వుతూ ...

''నన్ను గుర్తు పట్టడానికి కష్టపడకండి ! నేను ఆరు, ఏడు తరగతులు చదివేటప్పుడు, మీ ఇంటికి ప్రైవేటుకు వచ్చేదాన్ని'' ఆనందంగా బాల్యాన్ని జ్ఞాపకం చేసుకుంటూ అంది. అంత చిన్నతనంలో చూసి యిప్పుడు గుర్తు పట్టినందుకు ఆశ్చర్యాన్ని వెలిబుచ్చాడు.

''కొందరిని ఒకసారి చూస్తే చాలు జీవిత మంతా గుర్తుంటారు'' కళ్ళు తమాషాగా తిప్పుతూ తెల్లని పలువరుస కనపడేలా నవ్వింది. పై పంటి వరుసలో ఒక పన్ను పైకి వచ్చినా, నవ్వుకు అందాన్ని చేకూర్చింది. అలా పన్నుమీద పన్ను వుంటే అదృష్టమని అంటారు. ఆమెను చూస్తే అదృష్టవంతురాలిగానేకనుపిస్తుంది గొప్పచదువేకాక, ఐశ్వర్యవంతురాలని. ఆమె కట్టు బొట్టు ఖరీదుగా వున్నాయి. డాక్టరయినా ముక్కుకు రవ్వ బేసరి పెట్టింది. చామనఛాయలో అందం కంటె ఆకర్షణ ఎక్కువగా వుంది. అందంగా నవ్వుతుంది. కలుపు గోలుగ ఆత్మీయంగా కొత్త పాత లేకుండా మాట్లాడే ఆమెతో ఎవ్వరైనా, ఇట్టే స్నేహం చేస్తారు. మధ్య పాపిడి తీసి, సన్నగా దువ్వి, చిన్న ముడి వేసింది. లోకంలోని అందాలు, ఆనందాలు

తన స్వంతం అన్నట్లుగా తీరికగా, హుందాగా, సంతోషంగా వుంది. చిన్న కళ్లు చురుగ్గా తెలివిగా, చూస్తున్నాయి. ఆ కళ్ళ కదలికనుబట్టి ఆమె చలాకీదని చెప్పవచ్చు.

"మీరేమి చేస్తున్నారు ?" శ్రీకాంత్‌ను ప్రశ్నించింది.

"మిల్క్ (ప్రాడక్ట్స్) ఫ్యాక్టరీలో అసిస్టెంటు మేనేజరుగా వున్నాను."

"మేనేజింగ్ డైరెక్టర్ చంద్రశేఖర్ మా నాన్నగారు. మా ఫ్యాక్టరీలో పని చేస్తున్నా, మిమ్మల్ని చూడలేదు. తమాషా కదూ" అంటూ రమ్య వైపు చూసింది. రమ్య అందంగా వున్నా, బలహీనంగా వుంది. ఒక్క బంగారు నగ కూడా లేకపోవడం గుర్తించింది. రమ్యను పరీక్షించింది.

"మీ మిసెస్ ఎనిమిక్‌గ వుంది. ఎక్కువ ఐరన్ తీసుకోవలసి వుంటుంది. బ్లడ్, యూరిన్ పరీక్షించాక ట్రీట్‌మెంట్ మొదలు పెట్టుతాను. ఒకసారి మా ఇంటికి రండి టానిక్స్, కాప్స్యూల్స్ ఇస్తాను ..." పెన్‌తో పాడ్‌మీద ఏవో గీతలు గీస్తు శ్రీకాంత్‌ను చూస్తూ అంది.

శ్రీకాంత్ థ్యాంక్స్ చెప్పాడు.

"మా యిల్లు ఎక్కడో తెలుసనుకుంటాను" అంది

"మీ యిల్లు తెలియక పోవడమేమిటి ?" అన్నట్లుగా నవ్వాడు.

మరోసారి థాంక్స్ చెప్పి వచ్చాడు.

శ్రీకాంత్ మాస్లీగా, అతని స్వరం మళ్ళీ వినాలనిపించే విధంగా వుంది. ఎర్రటివాడు, విశాలమైన నుదురు, పొడుగాటి మగవాడి ముక్కు, నిండైన పెదాలు, పెద్దకళ్ళు, ఏ స్త్రీనైనా ఆకర్షిస్తాయి .. అని తలచింది.

రమ్య మనస్సేమీ బాగోలేదు. కాంతివైపు ఆ డాక్టర్ అలా చూస్తుందేమీ ! ఈ ఆసుపత్రికి రాకుంటే బాగుండేది. ఆలోచిస్తూ మౌనంగ వస్తున్న రమ్యతో —

"భయపడుతున్నావా ! రమ్యా! అంతగా భయపడనవసరం లేదు. తెలిసిన లేడీడాక్టర్ వుంది" తేలిగ్గా నిట్టూర్చాడు.

"కాంతీ! చిన్నప్పుడు ఆ అమ్మాయితో ఆడావా ? అంత బాగా గుర్తుపట్టింది. ఎప్పుడూ మీ ఇంట్లోనే వుండేదా ?" రమ్య భృకుటి ముడిచి అడుగుతుంటే శ్రీకాంత్‌కి నవ్వాగలేదు.

"ఆ అమ్మాయితో మొగుడు, పెళ్లాం ఆట ఆడలేదు. దిగులు పడకు !" శ్రీకాంత్ పకపక నవ్వాడు.

"నాకు టానిక్కు వద్దు. ఏ మాత్రలు వద్దు. అసలు మీరు ఆమె యింటికి వెళ్లొద్దు."

శ్రీకాంత్ తనమీద వాలిన దోమను చూపిస్తూ "రమ్యా ! దోమ నాపై వాలింది. కుట్టుతుంది కూడా అది ఆడదోమ!" రమ్యను ఆటలు పట్టించ సాగాడు.

"అది ఆడదని మీకెలా తెలుసు" చిరుకోపం ప్రదర్శించింది.

"కుట్టి, రక్తం పీల్చేవన్నీ ఆడదోమలేనట" చిరునవ్వుతో రమ్య నడుం చుట్టూ చేతులు వేసి, "ఇంత జెలసీ పెట్టుకుంటే ఎలానోయ్ ! చూసిన వాళ్ళందరు నీ మొగుణ్ణి ప్రేమిస్తారనుకుంటావు. ఇంత కంటే మరొకడు ప్రపంచంలో లేరా ?" శ్రీకాంత్ హృదయంపై తలవాల్చి పడుకుంది మరో మాట అనలేదు. ప్రపంచంలోని సుఖాలు, శాంతి అంతా అక్కడే వున్నట్లు తృప్తిగా కళ్ళు మూసుకుంది.

శ్రీకాంత్ రమ్య చెంపలు నిమురుతూ వుండిపోయాడు.

* * *

సుగుణక్క రమ్యకు శీమంతం జరిపించింది పుట్టింటికి పోతూ, రమ్యను కూడా రమ్మని బలవంత పెట్టింది. "మనిద్దరం పోతే ఇక్కడ మగవాళ్ళకి కష్టం కదా ! అంతగా కష్టమైరావాలనిపిస్తే తప్పక వస్తాను" అంటూ సుగుణక్కను సాగనంపింది.

"రమ్యా! ఈ కష్టం గట్టెక్కు ముందు. ప్రతి కానుపు స్త్రీకి మరో జన్మ ఎత్తినట్లే అంటారు. నీకు కానుపు ఎలా అవుతుందో! ఎముకలు ముదిరిపోయి వుంటాయి. లేటు కానుపు సులభమవుతుందా ! అసలు బతికి ఈ యింటికి వస్తావా !" అంటే రమ్య వెక్కి వెక్కి ఏడ్చింది.

అర్థం లేని తన మాటలతో రమ్య భయపడుతుందని గ్రహించి — "మీ బావ అసలే నిందు మనిషి. జాగ్రత్తగా చూసుకో!" అని చెప్తూ నవ్వించింది.

"ఈ మధ్య అతనికి తిండి యావ పడింది తింటానికి, బాగా తింటారు. అరగక గ్యాస్ వచ్చి బాధ పడుతారు" అంటూ భర్తను చూడమని, తన యిల్లు కూడా రమ్యకు వప్పగించి పోలేక పోయింది సుగుణ.

సుగుణక్క వెళ్లిపోతే, మరీ తోచకుండా పోయింది. ఒంటరితనం బాధించేది. శ్రీకాంత్ ఎప్పుడు వస్తాడా అని ఎదురు చూసేది.

ఒకరోజు అలా ఎదురుచూస్తుంటే ప్రక్కింటిలో అలికిడి వినిపించి తొంగిచూసింది. బెడ్‌రూంలోకి పోతున్న సుగుణక్కను చూసింది. ఆశ్చర్యపోయింది. "ఏమిటి ! సుగుణక్క ఎప్పుడు వచ్చింది ? కానుపు చేసుకునేవస్తానని చెప్పి వెళ్లింది — ఎందుకు ? ఎప్పుడు వచ్చినట్లు ? వచ్చి తనను ఎందుకు పలుకరించలేదు ? ఈ వేళప్పుడు ఆ జిగేల్‌మనే చీర ఎందుకు కట్టిందీ ?" అని తనను తాను ప్రశ్నించుకుంటూ — "అక్కా !.. సుగుణక్కా !!" అని పిలుస్తూ సంతోషంగా వచ్చింది, తొమ్మిది నెలలు నిండిన రమ్య.

బెడ్ రూంలోకి తొంగిచూసింది రమ్య. సర్పదష్టలా నిలుచుండిపోయింది. అద్దం ఎదురుగా నిలుచుంది సుగుణక్క కాదు. కాటుక, బొట్టుదిద్ది సుగుణక్క జాకెట్టు చీర ధరించి, నిండుగ పైట కట్టుకుని, కడుపు ఎత్తును చూసుకుంటూన్న వెంకట్రావ్‌ని చూసి నోట మాట రాలేదు. భయంతో బిగుసుకుపోయింది.

వెంకట్రావ్‌కి ఏమైంది ? — పొట్ట తొమ్మిది నెలలు నిండి ఇప్పుడో అప్పుడో కనే స్థితిలో వున్న ఆడదానిలా వున్న వెంకట్రావ్‌ను చూసింది. అద్దంలో నుంచి రమ్యను చూశాడు — చూస్తూనేవున్నాడు అని గ్రహించి కెవ్వుమని కేకవేసి, పరుగెత్తుకు వచ్చింది.

"అయ్యో రమ్యా! ఏమయ్యింది ?" అంటూ రాబోతున్న వెంకట్రావ్‌ను తప్పించుకుని పారిపోయింది.

అప్పుడే "టెలిగ్రాం" అన్న కేక విని, చీర విప్పి పంచ మాత్రం కట్టుకున్న వెంకట్రావ్, పరుగున వచ్చాడు. టెలిగ్రాం తీసుకున్నాడు.

"రమ్యా మీ అక్కకు...అక్కకు..." టెలిగ్రాం పట్టుకుని గునగున వచ్చాడు.

"పాపా ! బాబా ?" ఆత్రంగ అడిగింది.

"నొప్పులు ప్రారంభమయ్యాయట — ఇప్పటికి



# ప్రశ్నావళి * ప్రశ్నావళి * పశ్నావళి * ప్రశ్నావళి * ప్రశ్నావళి

**వి. ఎస్. ఆర్. – భువనేశ్వర్**

మీరు పక్షపాతంతో ఆంధ్ర ప్రాంతం నుంచి వచ్చిన లేఖలకే ప్రాధాన్యం యిస్తున్నట్లున్నారు. పైరాష్ట్రాలవారి ప్రశ్నలు కనబడడమే లేదు ?

★ ఇది మరీ బాగుంది సార్! ఇవేం నియోజకవర్గం గొడవలూ, వెనుకబడిన తనానికి నిదర్శనాలూనా. స్థలాలవారీగా, కులాలవారీగా విభజించడానికి! అయ్యో! ఈ శీర్షికలో అలాంటి ప్రసక్తికి చోటెలా వస్తుంది – నేనెక్కడున్నాను ?!

**జి. ఎస్. – సికింద్రాబాద్**

ప్రేమకి రేటుంది ?

★ కాదు సెక్సుకి వుందేమో! ప్రేమకి, ఆప్యాయతకి రేట్లు నిర్ణయించలేరు !

**కబీరు – అనంతపురం**

ఆడపిల్లలకు మేనత్త పోలికలు వస్తాయంటారు. మరి మీకు ఎవరివి సంక్రమించాయండీ ?

★ ఎందుకొచ్చిందీ సందేహం ? సరిగ్గా మా అత్తయ్య పోలికే నేను – పేరుతో సహా! [ఆవిడేం తక్కువ తినలేదట. ఓసారి పక్కవాటాలో పెద్ద మనిషి పెళ్ళాన్ని చావబాదుతూంటే – పొయ్యిలోంచి కొరకంచు పట్టుకు చక్కా వెళ్లిందట నా మేనత్త! 'ఆడకూతుర్ని కాల్చుకు తినమనిట్రా నీకు కట్టపెట్టారు ? ఏలుకోడం చేతకాకపోతే పుట్టింటికి పంపించు కాని ఇలా చంప'కని హుంకరించిందట!]

తినగ తినగ వేమ తీయగుండు అన్నదిపోయి మీ జవాబులు మరీ చేదుగా వున్నట్టు అనిపిస్తున్నాయి ?

★ చేదూ ఒక రుచే కబీరూ! తమకి తెలియనిదా ? పేరులోనే బీరు దాచారు !

**డి. బి కె. – బైపలి**

జీతాలు పెంచమని అధ్యాపకులు సమ్మె చేస్తే అది న్యాయం కాదు పిల్లల భవిష్యత్తు చెడగొడుతున్నారంటున్నారు. మీరేమంటారు ?

★ రోడ్డు కీడవనిదే ఏ సమస్యా పరిష్కారానికి నోచుకోని ప్రభుత్వంలో – సమ్మె ఎవరు చేసినా ఫరవాలేదు. ఇక పిల్లల భవిష్యత్తు అంటారా ? మహా చదివేస్తే అది మూడు పూవులూ ఆరు కాయలూగా వుంటుందని గ్యారంటీ ఏముంది కనుక?!

**డి. జె పి. – భువనేశ్వర్**

భార్య అస్తమానూ సాధిస్తే భర్త ఏం చేయాలి ?

★ సాధింపు అసలు కారణం – నిర్లక్ష్యం చేయబడడమే. అందుచేత – భార్యల మాటలు కాస్త పట్టించుకుంటూ వుండాలి. మాటలులేక సగం, మాట్లాడుకోక సగం సంసారాలు—ముళ్లకంపలవుతున్నాయని నా నమ్మకం. ఏముంటుంది మాట్లాడ్డానికి! అంటారు మగాళ్లు ... ఎందుకుండవని ప్రశ్న వేసుకోమంటాన్నేను. మాటా మాటా అనుకున్నా ఫరవాలేదు—ముంగిల్లాగా కాలం గడపడం కంటే

మీ దృక్పథంలో నీతి అంటే ఏమిటో ?

★ ఎదుటివారి జీవితాలకి ఎసరుపెట్టకపోవడం

**వాసు, ప్రసాద్ – అండలూరు**

పతియే ప్రత్యక్షదైవం అని పెద్దలు ఏనాడో అన్నారు. ఇప్పుడు మీరు కాదంటే పోతుందా ?

★ కాదనడం ఎందుకు – అది నిజమే అయితే !!

**సువర్ణ - ఉండి**

అందరికీ మీరు జవాబులిచ్చే తీరు అన్నా, మీరు అన్నా నాకిష్టం. నన్నేమైనా అంటే సహిస్తానుగాని, మిమ్మల్ని ఎవరైనా ఏమైనా అంటే – ఊరుకోను.

★ నేను అంతే సువర్ణా, నన్నంటే వూరుకుంటా. నాకిష్టులనేమైనా అంటే—అంతా విని- ''నేనిలా అనుకుంటున్నాను. మీ వాగుడు దండుగ' అంటాను. దాంతో వాళ్లు మరీ బెంగపడతారు - అంతా చెప్పేశామే అని !

**ఎస్. ఎస్. ఎస్. – విశాఖపట్నం**

కొందరి తిట్టే – లభ్యం అవుతుందా విజయం ? కీర్తి ?

★ పొరపాటు మూర్తిగారూ, విజయం కృషితోగాని దక్కదు. అలా దక్కినది చేజారిపోదు

**జగన్ – ఉరవకొండ**

ఆడది అవకాశవాదే కాక పురుషులను వంచన చేయగల జాణ—అని నేను నిరూపించకలను.

★ అవకాశవాది కాని వ్యక్తి వుండదు జాణతనం లేని ఆడదాన్ని చేతకానిదంటారు. అవకాశం వినియోగించుకోవడం, జాణగా తన వాడిని ఆకట్టుకోవడం పెద్ద ద్రోహం కాదు.

**టి. ఆర్. ఆర్ – కాకినాడ**

శోకాల అడుగున దాగి సుఖమున్నదిలే అని పెళ్లి చేసుకున్నవాళ్ళు విషాద గీతాలు పాడతారేం ?

★ చేసుకోనివాళ్లకి... పిరికిమందు పోయడానికి.

— కె. రామలక్ష్మి

## రాగజ్వాల

ప్రసవించి వుండవచ్చు'' అంటూనే — అంటూనే కడుపు పట్టుకున్నాడు అక్కడ నొప్పి ప్రారంభమైనట్లు బాధపడుతూ రెండు చేతులతో నడుం పట్టుకుని — నడవలేక కూర్చుండిపోయాడు. ప్రసవ వేదన పడుతున్నట్లు మూలిగాడు

''బావగారికి నొప్పులు ప్రారంభమయి పట్టున్నాయి కొంపదీసి నిజంగా కంటాడేమో! మంత్రసానిని నిజంగా పిలిస్తే మంచిదేమో'' అనుకుంటూ భయపడుతూ —

''పడుకోండి బావగారు — డాక్టరుకు కబురు పెడతాను ''

''ఎలా కంటాడు ? బిడ్డ వచ్చే దారేది—కడుపు కోయవలసిందేనా ?'' అన్నట్లుగా భయంగా వెంకట్రావు వైపు'పాపం'అన్నట్లుగా చూస్తుంటే— వెంకట్రావ్‌కు ముచ్చెమటలు పట్టాయి

అంతలో శ్రీకాంత్ మరో టెలిగ్రాం పట్టుకుని వచ్చాడు. సైకిల్‌ను అలా వదిలేసి ''కంగ్రాట్యులేషన్స్. అమ్మాయి పుట్టింది. మీకు లక్ష్మీదేవి పుట్టిందట...ఇదో టెలిగ్రాం'' అంటూ టెలిగ్రాం చూపించాడు.

వెంకట్రావ్‌ను పట్టను పగ్గాలు లేవు. చిన్న పిల్లాడిలా ఎగిరాడు, అరిచాడు, నోటికి వచ్చినట్లు వాగుతున్నాడు మరో అర్ధగంటలో ఆ వూరు వెళ్లాలని నిశ్చయించి స్నానం చేయటం కోసం లోపలికి వెళ్లాడు.

వున్నట్లుండి స్నానాల గదిలో నుంచి కేక వినబడింది. శ్రీకాంత్ పరుగున వెళ్లాడు.

వెంకట్రావ్ ''నా కడుపు – కడుపు'' అంటూ అదే సమయంలో బయటికి వస్తున్నాడు. మొలకు చుట్టుకున్న తుండు ఇప్పుడో అప్పుడో వూడిపోయేట్లుంది. వళ్లంతా తడిసివుంది. ''శ్రీకాంత్, శ్రీకాంత్ నా కడుపు చూశావా!'' గాలిపోయిన బెలూన్‌లా తుస్ మని లోపలికిపోయింది

''హారినీ ... అంత పెద్ద బొజ్జ క్షణంలో మాయమైంది. మరి మీకు అమ్మాయి పుట్టింది కదా! అందుకే తగ్గిపోయింది .. ''

''ఇంతా చేసి ఇంతేనా జరిగింది. శ్రీకాంతూ. నేను కంటాను. నేనూ ఒక చరిత్రను సృష్టిస్తాను. మగవాళ్ళను గర్వంగా తలెత్తుకునేలా చేద్దామనుకున్నానయ్యా ... '' ఆనందంగా నవ్వుతూ – తిరిగి స్నానాల గదిలోకి వెళ్లాడు

(ఇంకా వుంది)







కొత్తది. సున్నితమైన డెట్టాల్ సబ్బు.
మీ కుటుంబానికి ప్రీతితో లాలిస్తూ
సంరక్షించే ఈ సబ్బును సమకూర్చండి.
చర్మానికి, రూపానికి సంరక్షణ కోసం
శుభ్రత, ఆరోగ్యం కోసం ప్రతిరోజూ.
ప్రీతితో లాలిస్తూ సంరక్షించే డెట్టాల్ సబ్బు

## మీ కుటుంబానికి లాలించే సంరక్షించే డెట్టాల్ సబ్బును సమకూర్చండి.



Rediffusion/D/1162dTL

# బొమ్మల మహాభారతం — భారత యుద్ధం — మండపాక సీతారామాంజనేయులు

( గత సంచిక తరువాయి )

కౌరవ పాండవ బలంబుల మధ్య సంకుల సమరంబులు ద్వంద్వయుద్ధములు అనేకంబులు జరిగినవి.



రథికులకు బాసటగానున్న గజబలంబులయందును భయంకరమైన సంగ్రామము చెలరేగినది.



ఆశ్వికదళాలు విండ్లవారు, అర్ధనాయకులు, తమ తమ వర్గములో పదులు పదులు మొదలుకొని వేలకువేలు వరకు కలియబడి సందడి కయ్యంబు చేయసాగిరి

















అర్జునుడు పదియడుగుల దూరము ఈడ్వబడి, నేలచిక్క బట్టి కృష్ణుని, నిలువరించి, నచ్చజెప్పి వెనుకకు తీసికొని వచ్చాడు



అంత భీష్ముడు భీషణాకారుండై విజృంభించి పాంచాల సైన్యముల పరిమార్చుచు కౌరవవీరుల కుత్సాహము పాండవ బలంబులకు పరితాపము కలిగించాడు.

[ఇంకా వుంది]


ఆనందప్రదమైన రోజులు తిరిగి వచ్చేయి...




నలుగురూ కలిసి
ఆనందించే
సమయము ఇదే !






థమ్స అప్
కోలాయొక్క ఉల్లాసము
తాజాదనమునకు
నేసము

# సినిమా

—జి.వి.జి.

## అత్తగారి పెత్తనం

"మా అనంతలక్ష్మి ఇంటర్నేషనల్ యూనిట్ లోని వారంతా కారంచేడులో రాత్రనక, పగలనక శ్రమించి, 22 రోజుల్లో చిత్రాన్ని పూర్తిచేశాం. జూన్ నెలాఖరున విడుదల చేస్తాం," అన్నారు నిర్మాత దగ్గుపాటి భాస్కరరావు. "పెళ్ళాం బెల్లమాయె, తల్లి విషమాయె — అనే నానుడి వాక్యం ఒకటుంది. కొడుక్కి పెళ్ళి చేస్తే, అతగాడు భార్య మోజులో పడి తనకెక్కడ దూరమౌతాడోనని తహతహలాడే కొందరు తల్లులు లేకపోలేదు. సన్నివేశాల కల్పన అతి సహజంగా ఉన్నందువల్ల తల్లిగా షావుకారు జానకి, కొడుకుగా మురళీ



'అత్తగారి పెత్తనం'లో నూతన్‌ప్రసాద్, సుభాషిణి

మోహన్, కోడలుగా సరిత తమ పాత్రల్లో లీనమై నటించారు," అంటూ కొన్ని సన్నివేశాలను వివరించారు సంభాషణల కర్త, డైరెక్టర్ రాజాచంద్ర. సత్యం సంగీతంలో జాలాది, కొసరాజు రాసిన నాలుగు పాటలు కూడా ఎంతో మనోజ్ఞంగా ఉన్నాయి. నూతన్‌ప్రసాద్, సుభాషిణి, కృష్ణవేణి, కబీర్‌దాస్ ఇతర ముఖ్య పాత్రధారులు. వెంగయ్య ఛాయాగ్రాహకుడు. మార్తాండ్ సంకలనకర్త.

## అపురూప

మాదిరెడ్డి సులోచన రాసిన పై నవలను లక్ష్మీచిత్ర, శ్రీ లక్ష్మీచిత్ర అధినేత వై. హరికృష్ణ తెరకెక్కిస్తారు.

# 75,000 రూ.
# బహుమతులు గెలుచుకోండి

## మాల్టోవా "Zest for Life" ఉత్సాహభరితమైన పోటీలో పాల్గొనండి!

### మొత్తం 1001 బహుమతులు

**మొదటి బహుమానం**

రు. 25,000 నగదు లేదా 2 వ్యక్తులకు కాశ్మీర్ వినోదయాత్ర, దాంతోటే రు. 10,000

**2 రెండవ బహుమతులు**

లేనార్డ్ రిఫ్రిజిరేటర్ లేదా రు. 5,000 నగదు

**15 మూడవ బహుమతులు**

హెచ్ఎమ్‌వి స్టీరియో పాపులర్-2 లేదా రు. 1,000 నగదు.

**50 నాలుగవ బహుమతులు**

హాకిన్స్ ప్రెషర్ కుక్కర్ లేదా రు. 200 నగదు.

ఇప్పుడే మొదలెట్టండి! మొట్టమొదట వచ్చే యోగ్యత గల 10 000 ఎంట్రీలకు బోనస్ కానుక: మాల్టోవా పైన రు. 1 డిస్కౌంట్ కూపన్. +రంగుల్లో మురిపించే స్టికర్.




**933 కన్సొలేషన్ బహుమతులు**

మాల్టోవా జార్ ఉచితంగా

**మాల్టోవా**

ఆరోగ్యం, బలం మరియు శక్తి కోసం.

**షరతులు, నిబంధనలు :**

- ఈ పోటీలో భారతదేశంలో నివసించే వారందరూ పాల్గొనవచ్చును. అయితే జగత్‌జీత్ ఇన్‌డస్ట్రీస్ లిమిటెడ్ సంస్థలోనివారూ, వారి అనుబంధ సంస్థలలోనివారూ, మరియూ అడ్వర్టయిజింగ్ & సేల్స్ ప్రమోషన్ కంపెనీ వారూ, వారందరి కుటుంబాలలోనివారూ పాల్గొనరాదు.
- పోటీలో పాల్గొనే వ్యక్తి ఎన్ని ఎంట్రీలనైనా పంప వచ్చును. అయితే, ప్రతి ఎంట్రీతోబాటూ మాల్టోవా 500 గ్రా. జార్ యొక్క లేబుల్ మరియు దాని లోపల భాగంలో గల వేక్స్/సాయిల్ సీల్ లేదా 500 గ్రా. మాల్టోవా రీఫిల్ ప్యాక్ యొక్క పైభాగంలో గల రెండు పూర్తి 'ఫ్లేప్స్'ని, (అంటే ఒకటి జార్‌లోకి దీనిలోని మాల్టోవా పోస్తున్నట్లున్న చిత్రందీ, రెండవది దాంతోటే అతికించి ఉన్నదీ) తప్పక పంపాలి.
- ఎంట్రీలన్నీ పూర్తిగా ఇంగ్లీషులో నింపబడాలి. లేదా హింది, తమిళం, తెలుగు, కన్నడం, మలయాళం లేదా బెంగాలీలో నింపబడాలి. ఎంట్రీలలో, పోటీదారుకి పూర్తి పేరు, ఎడ్రసు, స్పష్టమైన దస్తూరీలో రాయబడాలి. అసంపూర్తివీ, అస్పష్టమైన ఎంట్రీలు పోటీలో నిరాకరింప బడవచ్చు
- ఎంట్రీలు చేరవలసిన ఆఖరు తేదీ. 7 ఆగష్టు 1981. ఈ దారిలో ఆలస్యం అయిన, పాడైపోయిన, లేదా పోయిన ఎంట్రీలకు ఈ కంపెనీ బాధ్యత వహించలేదు.
- ఎంట్రీలను మామూలు పోస్టులోనే పంపించాలి, వ్యక్తిగతంగాగాని, రిజిష్టర్డ్ పోస్టులోగాని పంపకూడదు,
- ఈ ఎంట్రీలు స్వతంత్రమైన జడ్జీల సంఘం ద్వారా నిర్ణయించబడతాయి. ఒకటికన్న ఎక్కువ సరియైన ఎంట్రీలు వచ్చే సందర్భంలో, పూర్తి చేయబడిన వాక్యం యొక్క ఉపజ్ఞపైన విజేతలు నిర్ణయింపబడతారు. జడ్జీలు తీసుకున్న నిర్ణయాలే, అన్ని పరిస్థితుల్లోనూ బద్ధమైనవై, తుదినిర్ణయాలై ఉంటాయి. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావు లేదు.
- బహుమతులన్నీ వర్తించే చోట్లల్లా భారతదేశపు పన్నుల చట్టం/యితర చట్టాలూ, వీటికి బద్ధమై ఉంటాయి.
- అన్ని ఎంట్రీలూ జగత్‌జీత్ ఇన్‌డస్ట్రీస్ లిమిటెడ్ వారికి చెందుతాయి.
- విజేతలందరికీ పోస్టులో సమాచారం అందించ బడుతుంది. 1వ, 2వ, 3వ, బహుమతి విజేతల పేర్లూ, అడ్రసులూ పత్రికల్లో ప్రకటించబడుతాయి.

---

## ఎంట్రీ ఫారమ్

**చూడండి, యిది ఎంతో తేలిక !**

1. ఇక్కడ చూపించిన మూడు చిత్రాలూ పిక్నిక్‌లోవున్న పిల్లలవి. వీటిలో ఒక చిత్రంలో గల భావాన్ని యీ వాక్యం బాగా చెబుతోంది.

"పిల్లల్లో ఆరోగ్యం ఉదికే ఉత్సాహం పొంగులు వారుతూంటే సరి వాళ్ళు చేసే అల్లరి కూడా ముచ్చటగానే ఉంటుంది మరి".

మీరు చేయవలసిందల్లా, యీ భావాన్ని మీ ఉద్దేశ్యంలో వీటిలో ఏ చిత్రం ఖచ్చితంగా వ్యక్తపరుస్తుందో దాన్ని (✓) గుర్తించడమే.



1 ☐



2 ☐



3 ☐

2 ఆ తర్వాత, యీ వాక్యాన్ని పూర్తి చెయ్యండి (15 అదనపు మాటలకు మించకుండా):

**మాల్టోవా తాగే పిల్లల జీవితంలో ఎంతగానో చురుకూ. ఉత్సాహం పొంగులు వారుతుంది, ఎందుకంటే**

______________________________

______________________________

______________________________

మీ ఎంట్రీలను వీరికి పంపండి : **Maltova "Zest for Life" Contest. P.O. Box No. 23, New Delhi 110 001.**

3. మీ పేరు, ఎడ్రసు (పెద్ద అక్షరాలతో) ______________________________

ఊరు ______________________________

రాష్ట్రం ______________________________

త్వరపడండి! పోటీ ముగింపు తేదీ. 7 ఆగష్టు 1981.

అదనపు ఎంట్రీ ఫారములు పేరెన్నికగన్న అన్ని దుకాణాల్లోనూ దొరుకుతాయి.

**JiL** జగత్‌జీత్ ఇన్‌డస్ట్రీస్ లిమిటెడ్

ASP/JIL/C-28-81 Tel.



'విశ్వరూపం'లో ఒక సన్నివేశం

## సి ని మా

### రామాపురంలో సీత

"ప్రతి చిత్రానికీ ముందు పతాక సన్నివేశాలు చిత్రీకరించడం నా అలవాటు. నేను డైరెక్ట్ చేసిన జాతర, యువతరం కదిలింది, ఎర్రమల్లెలు' చిత్రాలు విప్లవాత్మకమైన ఇతివృత్తాలు గలవి. ఆర్.కె. మూవీస్ వారి 'రామాపురంలో సీత' పూర్తిగా భిన్నమైన చిత్రం. ఇందులోని ప్రతి పాత్ర ప్రేక్షకుల హృదయాలలో చిరస్మరణీయంగా నిలిచిపోతుంది. మా కథకు తగ్గట్టే మాకు అన్నీ అనుకూలించాయి. మచ్చుకి ఓ విషయం చెప్తాను. మా స్క్రిప్ట్‌లో 'రామాపురం' అని ఊరి పేరు రాసుకున్నాం. మేం షూటింగ్‌కు చిత్తూరు జిల్లాలో ఎన్నుకున్న ఊరి పేరు అదే అయి ఉండడం తెలిసి, మా యూనిట్‌లోని అందరం చకితుల మయ్యాం. మా కథకు తగ్గట్టే ఆ ఊళ్ళో పెద్ద బావి, వగైరాలు చక్కగా అమరాయి – యాదృచ్ఛికంగా. అందుకే అందరూ ఎంతో ఉత్సాహంతో కృషి చేసి, 25 రోజుల కనుకున్న షెడ్యూల్‌ను 18 రోజుల్లోనే పూర్తిచేయగలిగాం," అన్నారు స్క్రీన్‌ప్లే, మాటలు రాసి, దర్శకత్వం వహించిన ధవళ సత్యం. "ఊరి ఉపకారికి ఆయుష్షు అతి స్వల్పం – అంటూంటారు కదా. అలాంటి ఉదాత్తమైన పాత్ర ఈ చిత్రంలో నాది. అందరికీ తగ్గ పాత్రలు దొరికాయి. అదే ఈ చిత్రంలో విశేషం," అన్నారు ఈ చిత్రాన్ని సమర్పిస్తూ, నాయక పాత్ర ధరించే రామకృష్ణ. సుజాత, చంద్రమోహన్, సాక్షి రంగారావు, పి.ఎల్. నారాయణ, భీమరాజు, జీవా, మమత, రమాప్రభ, పుష్పకుమారి, సీతాలత తక్కిన నటవర్గం. రాఘవులు, ఉదయరాజ్, రత్నం, రాజా, గోపి, వెంకట్రాజు, సత్యం తెరవెనుక కృషి చేశారు. ఆగస్ట్‌లో విడుదల చేయదలచినట్లు నిర్మాతలు జి. గణేశన్, జి. శ్రీనివాసన్ తెలిపారు.

### గోల్కొండ అబ్బులు

"ముఖ్యమైన షెడ్యూల్ ఆగస్ట్‌లో గోల్కొండలో జరుగుతుంది," అన్నారు దాసరి. ఈయన రచన, దర్శకత్వంలో కుమార్జీ నిర్మించే శ్రీ లక్ష్మీదేవి ఫిలింస్ వారి చిత్రం జూన్ 16న సెట్స్‌కు వెళ్లింది. కృష్ణంరాజు, జయప్రద, సత్యనారాయణ, రావుగోపాలరావు, అల్లురామలింగయ్య తెరముందు, మహదేవన్, కె.ఎస్. మణి, కోటగిరి గోపాలరావు తెరవెనుక కృషి చేస్తున్నారు.

### మురారి సమర్పణలో దేవులపల్లి గీతాల ఎల్.పి. రికార్డు

అశేష రసిక జనులను ఆకట్టుకున్న విఖ్యాత కవి కీ॥శే॥ దేవులపల్లి కృష్ణశాస్త్రి రచించిన 11 సినీ గీతాలను "ఇది మల్లెల వేళ" పేరుతో సరస్వతీ స్టోర్స్ సంస్థ ఎల్.పి. రికార్డుగా ఇటీవల విడుదల చేసింది. ఇందులో "మల్లీశ్వరి, నా ఇల్లు, బంగారు పాప, భాగ్యరేఖ, రాజమకుటం, పూజాఫలం, సుఖదుఃఖాలు, ఉండమ్మా బొట్టు పెడతా, బంగారు పంజరం, డాక్టర్ ఆనంద్, ఏకవీర" చిత్రాలలోని గీతాలున్నాయి. ప్రయాసతో ఏర్పకూర్చిన నిర్మాత కె. మురారిని పాలగుమ్మి పద్మరాజు ప్రశంసిస్తూ, తొలి రికార్డును దేవులపల్లి ఏకైక పుత్రుడు బుజ్జాయికి అందజేశారు.

## నేను – మా ఆవిడ
## తెరచాటు వ్యవహారం

పెళ్ళి పెద్దలలో ఒకరు (వంగా అప్పారావు) కృష్ణ (చంద్రమోహన్) వంక తిరిగి, "బాబూ, నువ్వెంతవరకు చదువుకున్నావ్?" అన్నాడు

"బియ్యే అండీ," జవాబిచ్చాడు కృష్ణ

అప్పారావు, కృష్ణ తండ్రి సుందరరామయ్య (హేమసుందర్)ను ఉద్దేశించి, "మీకు పిల్లలెంత మందండీ?" అని అడిగితే, ఆ ప్రశ్న తనకనుకొని కృష్ణ "అప్పుడే పిల్లలేమిటండీ? రెండు నెలలకే పిల్లలు పుడతారటండీ?" అన్నాడు అప్పారావుకు అర్థమైచావక "రెండు నెలలకి పిల్లలేమిటయ్యా?" అన్నాడు

"అదేనండీ మేం కాపురం చేసింది రెండు నెలలే కదండీ?" అన్నాడు కృష్ణ

అప్పారావు బుర్ర గోక్కుంటూ, "ఏమిటండీ, సుందరరామయ్యగారూ! రెండు నెల్ల కాపురం ఏమిటండీ?" అన్నాడు

సుందరరామయ్య తడబడుతూ, "ఏం లేదులెండి ఏదో తమాషాకి అన్నాడు మీరేం పట్టించుకోవద్దు పోయినసారి కూడా ఇలాగే సంబంధం వచ్చిందండి వీడు ఊరుకోకుండా 'నేను – మా ఆవిడ కలిసి కాపురం చేయలేదండీ' అని చెప్పాడు దాంతో వాళ్ళు వెళ్ళిపోయారు ఊరికే తమాషాకి అలా అంటూ ఉంటాడు మీరేం పట్టించుకోకండి," అన్నాడు

కృష్ణ చివాలున లేచి నిలుచొని, "అదిగో – అదిగో మా ఆవిడ సంగతి కాని, మా ఆవిడ – నేను కాపురం చేసిన సంగతి కాని చెప్పొద్దని అన్నారు కదా? మళ్ళీ ఆ కూతే కూస్తారా?' అన్నాడు

అప్పారావు ఆముదం తాగినవాడిలా ముఖం పెట్టేసి, "తర్వాత వస్తాం, సుందరరామయ్య గారూ!" అంటూ తనతో వచ్చినవారితో కలిసి చక్కా వెళ్ళిపోయాడు

సుందరరామయ్యకు అరికాలిమంట నెత్తి కెక్కింది "వెధవా! కావాలని నువ్వు పెళ్ళి సంబంధం చెడగొట్టడం కోసం మన్నిలా మాట్లాడుతున్నావ్ ఈసారి వాళ్ళు ఏమడిగినాసరే నువ్వు నోరెత్తకూడదు వాళ్ళు అడిగినదానికి నేను సమాధానం చెప్తాను నువ్వు నోరు మూసుకొని ఉండు"

"సరే!" అంటూ కృష్ణ ఏడ్పుముఖం పెట్టాడు

దాసరి నారాయణరావు స్క్రీన్‌ప్లే, పర్యవేక్షణలో యు ఎస్ ఆర్ మోహనరావు నిర్మించే రాజలక్ష్మీ కంబైన్స్ "నేను – మా ఆవిడ" చిత్రానికి రేలంగి నరసింహారావు దర్శకుడు గిరిబాబు, కాకరాల, మోదుకూరి సత్యం, పొట్టి పంతులు, సుబ్బారావు, ప్రభ, కె విజయ, నిర్మల, బేబీ వరలక్ష్మి, పుష్పకుమారి, జయశీల ఇతర పాత్రధారులు పార్థసారధిరెడ్డి కథకు కాశీ విశ్వనాథ్ సంభాషణల కర్త దాసరి, వేటూరి గీతాలకు సత్యం బాణీలు కూర్చారు బి కోటేశ్వరరావు ఛాయ, భాస్కరరాజు శిల్పం, రాజగోపాల్ కూర్పు, ఎన్ హరిబాబు ఛాయ, సి వి ఎస్ రామారావు బి ఎస్ సి, బి కామ్ ప్రొడక్షన్ నిర్వహించారు

### సినిమా

'ఊరికిచ్చిన మాట'లో ఒక దృశ్యం



## సినిమా

### కె. ఎస్. రామిరెడ్డి దర్శకత్వంలో కృష్ణ

"కృష్ణగారు సెప్టెంబర్ నుంచి కాల్‌షీట్లు ఇచ్చారు," అన్నారు కె. ఎస్. రామిరెడ్డి. ఈయన లోగడ "అభిమానవంతులు, తొలిరేయి గడిచింది" చిత్రాలకు దర్శకత్వం వహించిన విషయం అందరికీ






సి ఐ డి సికిందర్ లో మోహన్‌బాబు

తెలిసిందే. ఇప్పుడీయన దర్శకత్వంలో జన్మ ఫలిక్స్ సమర్పించే చిత్రాన్ని కృష్ణశ్రీ క్రియేషన్స్ అధినేతలు ...ం కాంతారావు, ఓ శ్రీరాములు నిర్మిస్తారు.

కాల్షియంలోపించిన ఎముకలు బలహీనంగా ఉంటాయి.
సులభంగా దెబ్బ తింటాయి.

# కాల్షియం-శాండోజ్
# ఎముకల నిర్మాణాన్ని బలపరుస్తుంది

ఎముకలు కంటికి కనిపించవు. అయినా అవి మీ పిల్లల పెరుగుదలకు, వికాసానికి అతిముఖ్యమైనవి. కాల్షియం ఎముకలలోను, పళ్లలోను గల అతిముఖ్య పదార్థ భాగం. కాల్షియం లోపం వల్ల ఎముకలలో బలహీనత పెళుసుతనం సంభవిస్తాయి. పళ్లు వదులై చిల్లులు పడిపోతాయి.

శక్తివంతమైన పళ్లకోసం, ఆరోగ్యవంతమైన ఎముకలకోసం మీ బిడ్డకి రోజుకు 3-4 వెనిల్లా వాసనగల కాల్షియం-శాండోజ్ బిళ్లలు ఇవ్వండి. ప్రతి బిళ్లా కాల్షియంతోపాటు C, D, $B_{12}$, విటమిన్లతో పటిష్టం చేయబడింది.

మీ బిడ్డడు ప్రతి రోజూ కాల్షియం కోల్పోతాడు. అది తిరిగి సమకూర్చాలి. లేకపోతే అతని పెరుగుదల దెబ్బతింటుంది. మామూలు భోజనం కావల్సినంత కాల్షియం ఇయ్యలేక పోవచ్చు.

**ఈ రోజే అతనికి కాల్షియం-శాండోజ్ ఇవ్వడం మొదలు పెట్టండి-ఎక్కువ ఆలస్యం అయిన తర్వాత ఎంత కాల్షియం యిచ్చినా కాల్షియం లోపంవలన కలిగిన హానిని మరమ్మతు చేయటం సాధ్యం కాదు.**

గుర్తుంచుకోండి. అన్ని కాల్షియం బిళ్లలు ఒకటేకావు.

**కాల్షియం—శాండోజ్ మాత్రమే కావాలని అడగండి. మారుగా యిచ్చే ఏ యితర వాటితోను సరిపెట్టుకోకండి.**

కాల్షియం-శాండోజ్— స్విట్జర్లండులోని శాండోజ్ వారిచేత పెంపొందించబడిన అత్యుత్తమమైన కాల్షియం.



**గట్టిపళ్లు, పటిష్టమైన ఎముకల కోసం కాల్షియం-శాండోజ్®**




daCunha/S-25 Rev/TL



# సినిమా

## గతించని గతం

"గోపీచంద్‌గారి 'గతించని గతం'ను తెర కెక్కించాలన్న నా చిరకాల వాంఛ ఇంతకాలానికి ఈడేరింది," అన్నారు కొమ్మినేని కృష్ణమూర్తి ఈయన సినేరియో దర్శకత్వంలో యార్లగడ్డ వెంకన్న చౌదరి సమర్పించే చిత్రంలో హుస్సేన్‌ఖాన్ పాత్రలో మాదాల రంగారావు కనిపిస్తారు మాధవపెద్ది గోఖలే శిల్పం, రామేంద్రరాయ్ ఛాయ, ఎస్ ఆర్ అరిపిరాల కూర్పులో ఈ రజాకార్ ఉద్యమం ఇతివృత్తాన్ని యార్లగడ్డ శంభుప్రసాద్ నిర్మిస్తారు. పూర్తిగా ఒకే షెడ్యూల్‌లో హైదరాబాద్‌లో పూర్తవుతుంది శంభు ఆర్ట్ పిక్చర్స్ తయారీ

## శ్రీ కల్యాణ్ ఆర్ట్ మూవీస్

"గిరిబాబుగారు కథ సమకూర్చి సహాయ సహకారాలను అందజేస్తున్నారు," అన్నారు అల్లూరి వెంకట్రాజు ఈయన సమర్పించే శ్రీ కల్యాణ్ ఆర్ట్ మూవీస్ తొలి చిత్రానికి "సంధ్యారాగం" డైరెక్టర్ ఎస్ రామచంద్రరావు దర్శకత్వం వహిస్తున్నారు మే 22న రమేష్‌నాయుడు సంగీత దర్శకత్వంలో తొలి గీతం రికార్డయింది మాటలు, పాటలు గోపి రాశారు వెంగయ్య ఛాయ, రంగారావు శిల్పం, కందస్వామి కూర్పు, శ్రీనివాస్ నిర్వహణ, త్రికప్ సహకార దర్శకత్వంతో జి కె రావు, లక్ష్మీనారాయణ నిర్మాతలు చంద్రమోహన్ హీరో

శ్రీమతి అక్కినేని అన్నపూర్ణ సమర్పించు

అన్నపూర్ణ స్టూడియోస్

# ప్రేమాభిషేకం

ఈస్ట్‌మన్‌కలర్

దర్శకత్వం
కె.రాఘవేంద్రరావు B.A.

నిర్మాతలు
వెంకట్ అక్కినేని, నాగార్జున అక్కినేని



ఎగ్జిక్యూటివ్ నిర్మాత:
**కె.ఆంజనేయ చౌదరి**

సంగీతం: చక్రవర్తి

కెమెరా: కె.యస్.ప్రకాష్

అన్నపూర్ణ



'అత్తగారి పెత్తనం'లో సరిత, మురళీమోహన్

రావులమ్మ (రమాప్రభ) విరుచుకుపడింది కాని, ఆమెను సింగన్న ఖాతరు చెయ్యలేదు పెళ్ళికి ఒప్పేసుకున్న అప్పుడు మెల్లగా సీత దగ్గరకు వెళ్ళాడు రావులమ్మకు మతి పోయినట్లయింది

"ఇలా అమాహ్యమైన మలుపులు ఈ చిత్రంలో ఎన్నో ఉన్నాయి," అన్నారు కె మురారి ఈయనా, కథకుడు విజయబాపినీడు కలిపి నిర్మించిన జ్యోతి చిత్రవారి "జే గంటలు". చిత్రాన్ని ఎస్ శ్రీనివాసరావు దర్శకత్వంలో మాగంటి రవీంద్రనాథ్ చౌదరి, కె నరసింహంనాయుడు సమర్పిస్తున్నారు

కె మురారి రూపొందించే చిత్రాలలో కథ, కథనంతోపాటు సంగీత సాహిత్యాలకూ ఎంతో ప్రాముఖ్యత ఉంటుంది అరవై అడుగుల ఎత్తున జలపాతం మధ్య చిత్రీకరించిన "పన్నీటి జల్లులే హేమంత తుషారాలు," సారంగ మార్గాల ద్వారా రైల్వే ట్రాక్‌పై ట్రాలీమీద చిత్రీకరణ జరిపిన "ఇది అమని సాగే చైత్రరథం — ఇది రుక్మిణి ఎక్కిన పూలరథం," మన దేశంలో ఎత్తయిన బ్రాడ్‌గేజ్ స్టేషన్ బమిలిగూడ ఎద్ద అరుణోదయ కాంతులలో "ఎవరమ్మా ఈ కొమ్మ, కులుకులమ్మ కన్న కూతురా ? మెరుపులమ్మ మేనకోడలా ?" (జేసుదాసు, వాణీజయరాం), గోదావరి తీరాన "సీతారాముల కల్యాణం" యక్షగానం, పాడేరు సమీపాన అందమైన లోయలలో "వందనాలు — వలపుల హరిచందనాలు" ఈ చిత్రంలో హైలైట్స్ "అన్నిటికన్నా మీకే చిత్రీకరణ బాగా నచ్చింది ?" అని మురారినే అడిగితే, "సీతారాముల కల్యాణం," అని చెప్పి, తాను చక్రపాణి శిష్యుడ్నని మరో మారు రుజావు చేసుకున్నారు ★

## జే గంటలులో కల్యాణ ఘడియలు

దొడ్డి గుమ్మం దగ్గర కూర్చున్న మూగ అప్పడి (ప్రతాప్) పేద మనసు గిలగిలా కొట్టుకుంటోంది సీతే తన దేవతనీ, సర్వమనీ నమ్మి, ఆమె చుట్టూ భక్తితో ప్రదక్షిణాలు చేసిన తనకు ఘోరమైన అన్యాయం జరిగిపోతోంది లోపల సీత (ముచ్చెర్ల అరుణ)కు ఎవరితోనో పెళ్ళిచూపుల తంతు జరుగుతోంది సీత మురిపెంగా తలలో పెట్టుకునే బంతిపువ్వు అతని చేతిలో నలిగిపోతోంది ఆ కోపం సీతమీద కాదు ఆమె తండ్రి, తనకు మావ అయిన సింగన్నమీద లోపల్నించి మాటలు వినిపిస్తున్నాయి మగ పెళ్ళివాళ్ళకు సీత కను ముక్కు తీరు లక్షణంగా ఉండి, లక్ష్మీదేవిలా ఉందట అందరి ముఖాల్లోనూ ఆనందం విందుకున్న

## సినిమా

ఆ తరుణంలో ఎలా తెలిసిందో అసలు నిజం పెళ్ళి కొడుకు తండ్రి ఆకాశమంతెత్తుకు లేచి, "ఎంగిలి కూడుని మాకు అంటగడ్తావా ?" అని సింగన్నను నిందించపొగాడు

పెళ్ళి వాళ్ళెళ్ళిపోయారు సీతమీద సింగన్న విరుచుకుపడ్డాడు — ఆమె తెచ్చిన అప్రతిష్ఠకు బ్రతుకు అల్లరిపాలైందని, ప్రేమ—ప్రేమ అని తిరిగిన ఆమె తిరుగుడి పర్యవసానం ఇదని, ఇక ఆమె నెవడూ చేసుకోడని వెంటనే సింగన్న, అప్పడి దగ్గరకు వచ్చి, "సీతకు నువ్వే భర్తవు," అన్నాడు

అప్పడికి అది కలో, నిజమో తోచలేదు

అవిటివాడూ, మూగవాడూ అయిన అప్పడికి మహారాణి లాంటి సీతను ఇచ్చి కట్టడానికి మనసెలా వచ్చిందని సింగన్నమీద ఆ ఇంటి శ్రేయోభిలాషి



గంగాధర

# తప్పక చూడండి!

యం. బాలయ్య బి.ఏ. సమర్పించు అమృతా ఫిలింస్ వారి

# ఊరుకిచ్చిన మాట

కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం
**యం. బాలయ్య బి.ఏ.**

కెమేరా: యస్.యస్.లాల్, మాటలు: D.V.నరసరాజు
సంగీతం: M.S.విశ్వనాథం, ఎడిటింగ్: S.P.S.వీరప్ప, నృత్యం: N.A.తార

నిర్మాతలు: **అలపర్తి సూర్యనారాయణ**
**మన్నవ వెంకట్రావు**

---

## మీరూ ఓ కోడలికి అత్తగారా?

1. మీ కోడలు మిమ్మల్ని కన్నతల్లితో సమానంగా చూసుకుంటుందా? ఆమెపై మీ అభిప్రాయం ఏమిటి?
2. బాధ్యతగల ఒక ప్రధాన వ్యక్తిగా ఏ ఇంటి కోడలయినా ఎలా ప్రవర్తిస్తే బాగుంటుందంటారు?
3. ఏ అత్తగారయినా తన కోడలిని కష్టపెడితే, ఆ కష్టాలన్నీ ఆ కోడలు భరించి ఏదో ఒకరోజు ఎదురు తిరిగితే అప్పుడా అత్తగారు ఏంచెయ్యాలి?
4. కొడుకు ఇంటికి రాగానే కోడలు అత్తగారిపై ఫిర్యాదులు చేయడంపై మీ అభిప్రాయం ఏమిటి?
5. అత్తాకోడళ్ల మనస్పర్థల మధ్య కొడుకు నలిగిపోతుంటే, వాటినుండి కొడుకును తప్పించేందుకు తల్లిగా మీరయితే ఏంచేస్తారు?

పై ప్రశ్నలకు సమాధానాలు రాస్తూ మీ చిరునామా రాస్తే ఉత్తమమయిన జవాబులు రాసిన అత్తగార్లకు సొగసరి బహుమతి లభిస్తుంది.

మీ ప్రశ్నలకు సరయిన సమాధానాలు లభించాలంటే
**"గడసరి అత్త సొగసరి కోడలు"**
చిత్రం చూసి తెల్సుకోండి.

కట్టా సుబ్బారావు

3-సి. రాజారాం డైరక్టర్స్ కాలనీ, కోడంబాకం, మద్రాసు-600 024.



# పుష్కలమైన పంట-లక్ష్మి మీ ఇంట
# ...ఆ పంటను పెంచి పోషించేది జై కిసాన్

జైకిసాన్ మీ పంటలను పెంచి పోషిస్తుంది, మీ కలల్ని నిజమని నిరూపిస్తుంది. అధునాతనమైన సాంకేతిక పరిజ్ఞానం ఆధారంగా గల జైకిసాన్ శక్తివంతమైన ఎరువులు భూమిలో వెంటనే కరిగి మీ పంటలకు అపారమైన శక్తినీ, తక్షణమైన పెరుగుదలనూ చేకూరుస్తాయి. మీ పైర్లతోపాటే మీ భాగ్యంకూడా వికసిస్తుంది ...మీకు హెచ్చు దిగుబడినీ, దాంతోపాటు హెచ్చు సంపదనూ ఇస్తుంది జైకిసాన్. గుర్తుంచుకోండి, ప్రతి పంటకు, ప్రతి భూమికి అవసరానికి తగిన పాళ్లలో వేయడానికి జైకిసాన్ ఎరువు ఉంది. జైకిసాన్ ఎరువుల విస్తృతమైన శ్రేణిలోంచి మీరు మీకు కావలసినదాన్ని ఎంచుకోవచ్చు.

**జై కిసాన్ యూరియా 46.4% నత్రజని** అతి తెల్లటిది, అతి స్వల్పమైనది, అతి శక్తివంతమైనది. దీనిలో బైయూరెట్ పాలు అతి తక్కువ (0.5% కంటే తక్కువ). అంచేత ఆకుల మీద పిచికారి చేయడానికి సురక్షితమైనది. అన్ని పంటలకూ భూమిమీద పై చల్లుగా అనువైన ఎరువు.

**జై కిసాన్ యూరంఫాస్ 28:28:0** అత్యధికంగా నత్రజని, ఫాస్ఫేటూ సమానమైన పాళ్లలో గల శక్తివంతమైన ఎరువు. దాదాపు పూర్తిగా నీటిలో కరుగుతుంది. దీనిలోని రెండు పోషక పదార్థాలూ కూడా ఒకే సమయంలో భూమిలో కరిగి పెరుగుతున్న పంటకు అందుబాటులో ఉంటాయి.

**జై కిసాన్ సంపూర్ణ 19:19:19** అతి చిక్కనైన కాంప్లెక్స్ ఎరువు. దీనిలో నత్రజని, ఫాస్ఫేటు, పొటాష్‌లు సమానమైన పాళ్లలో ఉన్నాయి. దాదాపు పూర్తిగా నీటిలో కరిగే ఈ ఎరువులో 57% పోషక పదార్థాలున్నాయి. అవన్నీ ఒకే సమయంలో భూమిలో కరిగి పంట వాటిని సులభంగా గ్రహించడానికి వీలు పడుతుంది. పొటాష్ లోపం గల భూములకు జైకిసాన్ సంపూర్ణ ప్రత్యేకించి లాభదాయకమైనది.

**జైకిసాన్ యూరంఫాస్, సంపూర్ణ ముఖ్యంగా అధిక దిగుబడి రకపు వరి, చెరకు, కాయగూరలు, పత్తి, జొన్న, గోధుమ మొదలైన పంటలకు బాగా అనువైనవి. అంతేకాదు, కాఫీ, తేయాకు లాంటి తోట పంటలకూ, మామిడి, కమలా, నారింజ, అరటి మొదలైన పండ్ల తోటలకూ కూడా ఎంతో అనువైనవి.**

**జై కిసాన్ సౌభాగ్య 14:35:14** నత్రజని, పొటాష్‌లు దీనిలో సమానమైన (ఒక్కొక్కటి 14%) పాళ్లలో ఉన్నాయి. పైగా 35% ఫాస్ఫేటు కూడా ఉంది—అంటే మొత్తం 63% పోషక పదార్థాలు ఉన్నాయన్నమాట. ఫాస్ఫేటు హెచ్చుగా ఉండటం వల్ల జైకిసాన్ సౌభాగ్య ముఖ్యంగా వేరుశనగ, ఇతర నూనె గింజల పంటలకూ, పప్పు దినుసుల పంటలకూ బాగా అనువైనది. దుంపజాతి పంటలైన బంగాళాదుంప (ఆలుగడ్డ), పసుపు, కందమూలం, ఉల్లి మొదలైనవాటికి కూడా ఎంతో మంచిది. చెరకు, పత్తి పంటలకూ, ఏలకులు మొదలైన తోట పంటలకూ కూడా ఉపయోగకరమైనది.

**జై కిసాన్ డయంఫాస్ 18:46:0** డయంఫాస్ 18:46:0 లో 18% నత్రజని, 46% ఫాస్ఫేటు ఉన్నాయి. అత్యధికంగా పాళ్లు కలిగిన కాంప్లెక్స్ ఎరువు అయినందువల్ల తక్కువ పరిమాణంలో వేస్తే చాలు. అంచేత ఖర్చుకూడా చాలా తక్కువ. ఈ ఎరువు ప్రత్యేకించి, హెచ్చుగా ఫాస్ఫేట్ కావలసిన పంటలకు అంటే వేరుశనగ, పప్పు దినుసులు, నూనె గింజలు మొదలైన వాటికి, పసుపులాంటి దుంపజాతి పంటలకూ అనువైనది. చెరకు, పత్తి పంటలకు కూడా మంచిది.

## జై కిసాన్ ఎరువులు-అత్యంత శక్తికీ, సత్వర పెరుగుదలకూ




**జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్, గోవా.**
ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు: కర్నూలు, సికింద్రాబాద్, బెంగుళూరు, హుబ్లి, కొంకణ్, నాగపూర్, పూనా.
మీ జైకిసాన్ ఎరువుల్ని జువారి వారి పసుపు పచ్చ దుకాణాల్లో కొనుక్కోండి.









"మేనకా! దయతో జవాబిచ్చిన నీకు కృతజ్ఞతలు ... మరోసారి ఆలోచించు. అందం అశాశ్వతము. ప్రేమానురాగాలే కడవరకు నిల్చేది. దేవుడు నీకు ద్విగుణీకృత అందాన్నిచ్చాడు — కాదనను. కాని నేను మాత్రం వికారంగా లేనే! నేను నలుపనే కదా నీవు వెనుకాడుతున్నది. దేవుడు నలుపు — శిరోజాలు నలుపు — నయనాలు నలుపు — మరి నలుపుకు ఇంత ప్రాధాన్యత వున్నప్పుడు నన్నెందుకసహ్యించుకుంటావ్? నేను కోరి నీ పాదాల చెంత చేరాలనుకున్నాను. నేను 'ఊఁ' అంటే వేయి మంది అందమైన యువతులు 'క్యూ'లో నిల్చుంటారు నన్ను పెళ్ళాడ్డానికి. వారిని ఆకర్షించడానికి నా డబ్బు, హోదా చాలు. కానీ...కానీ నేను నిన్నే మనసారా ప్రేమిస్తున్నాను. అందునా నీవు స్వయాన అక్క కూతురివి. అందుకే ఇంత భంగపడుతున్నాను. అదీగాక అక్క అందంగా లేదని, బావ అక్కను దారుణంగా వదిలిపెట్టి పోయాడు. ఇప్పటికే లోకానికి జవాబు చెప్పలేక అక్క కుమిలిపోతూవుంది. అక్కకు, నీకు ఆసరాగా నిలవాలని నా ఆకాంక్ష. మన ముగ్గురిలో ప్రవహించే రక్తం ఒకటే. అందుకే ఇంత 'ఇది'గా నిన్ను ప్రార్థిస్తున్నాను. నీవు ప్రస్తుతానికి కాదన్నా, నీ మనసు మారి నన్ను చేసుకుంటాననేవరకు నీకోసం వేచి వుంటాను. లేదా నీవు మరొకర్ని పెళ్ళాడితే నాకా అదృష్టం లేదని చింతిస్తాను.

ఇట్లు,
నీ ప్రియమైన బావ
సుందర్"

"ఎవరి దగ్గర్నుంచే వుత్తరం?" అమ్మ పిలుపుతో ఉత్తరాన్ని చదవడం పూర్తిచేసిన మేనక "మీ తమ్ముడేనమ్మా ఉత్తరం వ్రాసింది" అంటూ జవాబిచ్చింది.

"బావన్నేనా! మరి నీ వెర్రితనం కాకపోతే... ఏమి రాశాడేమిటి పిచ్చిసన్నాసి?" వంటింట్లోంచి వస్తూ అడిగింది పార్వతమ్మ.

"ఏమి రాస్తాడు? తనని పెళ్ళి చేసుకోమని రాశాడు... ఇది మామూలేగా... అతని పిచ్చి అతనికి ఆనందం." ఉత్తరం టేబుల్ పైన పడేసి, తను ఇంద్రమోహన్ కిచ్చిన ప్రోగ్రాం ప్రకారం బీచి కెళ్ళడానికి తయారైంది.

"అమ్మా! నేను బీచి కెళ్ళొస్తాను" పార్వతమ్మతో చెప్పింది.

"ఇప్పుడంత అర్జంటేమిటే?" చేతులు చీర కొంగుతో తుడుచుకుంటూ అడిగింది పార్వతమ్మ.

**వీడికి హార్లిక్స్ ఇస్తున్నాను, వాడు త్వ గా**
**ఆరోగ్యం కోలుకొనేందుకు హార్లిక్స్ తోడ్ప తుంది**



జబ్బు పడ్డప్పుడు బలహీనంగా ఉండటం, ఆకలి లేకపోవటం మామూలే. అలాంటి సమయాలలో మా కుటుంబ సభ్యులకు హార్లిక్స్ ఇవ్వమని మా డాక్టరు శిఫారసు చేస్తారు. హార్లిక్స్ తేలికగా జీర్ణమవుతుందనీ, త్వరగా కోలుకోవటానికి తోడ్పడుతుందనీ ఆయన చెప్పారు.

**మీరు కూడా మీ కుటుంబంలోని వారికి హార్లిక్స్ ఇస్తారు కదూ?"**




**మంచి పుష్టికరమైనది**

హార్లిక్స్ రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు

"ఆరోగ్య పోషణకు మూలాధారం హార్లిక్స్. వివిధ పోషకాహారాలతో అద్భుతంగా దానిని తయారుచేశారు. ఎన్నో ఏండ్లుగా సుస్థిరమైన మంచి ఫలితాలను యిస్తోంది. అందుచేతనే మా కుటుంబ సభ్యుల ఆరోగ్యాభివృద్ధికి, వారు రోజుల తరబడి చురుగ్గా ఉండేందుకూ హార్లిక్స్‌ను నేను శిఫారసు చేస్తున్నాను."



HTD-HMM-6757

"ఇంద్రమోహన్‌ను కల్సుకోవాలి. నేను వస్తానని మాటిచ్చాను."

"పెళ్ళి కాకుండా ఈ కల్సుకోవటా లేమిటే ?" కోపంగా అడిగింది.

"నేనేమి చిన్న పిల్లను కాను. అతను నన్ను ఏమి చేయడులే! వాళ్ళమ్మ, నాన్నలు కూడా ఒప్పుకున్నారట. నన్ను తప్ప మరెవర్ని పెళ్ళి చేసుకోనని భీష్మించుకు కూర్చున్నాడు. పైగా కానీ కట్నం లేదు. ఇంకా చెప్పాలంటే అతను అందగాడు. నా తోటి లెక్చరర్ ... అన్నిటికీ మించి అతను నాకు నచ్చినాడు. నేను అతన్ని ప్రేమించాను. కాని .. కాని ... నీవేమో బావను చేసుకోమంటావ్ ! చూసి చూసి నాకు నచ్చని పెళ్ళి చేస్తావా అమ్మా?" దీనంగా అడిగింది మేనక.

"నీ మనస్సు కష్టపెట్టేంత మూర్ఖురాలు కాదమ్మా మీ అమ్మ. అయితే ఒకటి మాత్రం గుర్తుంచుకో. నేను భర్త వుండి లేనిదానిలాగా వుండటానికి, నీకు తండ్రి లేకపోవడానికి కారణం ఈ అర్థంలేని ప్రేమలు, అందాలే నమ్మా. నీ అందాన్ని చూసి ఇంద్రమోహన్ కాకుంటే మరో చంద్రమోహన్ చేసుకుంటాడు ... నేను నీలాగే ఇంకా చెప్పాలంటే నీ కంటే అందంగా వుండేదాన్ని. ఆ అందం చూసే లక్షాధికారైన

# అశాశ్వతం

మీ నాన్న నన్ను చేసుకున్నాడు. నేను అందర్ని ఎదిరించి ... అతన్ని చేపట్టాను. ఒక్క సంవత్సరము బాగా గడించింది. స్వర్గమే చూశాను. ఆ సంవత్సరమే నీవు పుట్టావు. ఆ తర్వాత నాకు మశూచి వచ్చింది ... ఎన్నో సంవత్సరాల "అందం" కొద్ది రోజులలోనే మాడిపోయింది. నేను వికృతంగా వున్నానని, నా మొహాన ఒక లక్ష రూపాయలు పారేసి, తను మరొకర్ని వివాహం చేసుకున్నారు. నా పీడ వదిలించుకున్నారు. అప్పట్నుంచి మీ బావ, మీ తాత ఆసరాతో నిన్ను పెద్దదాన్ని చేసి, లెక్చరర్ని చేశాను... అందుకని నీవు బాగా ఆలోచించుకో! ఈ రోజు ఇంద్రమోహన్ నిన్ను మోహించి వుండవచ్చు. ఇంద్రలోకాన్నే చూపించవచ్చు... కాని ఎలాటి పరిస్థితులలోనైనా నీ అందం పాడైతే నీ జీవితం నా బ్రతుకులా కాకూడదు. అది ముందు తెల్సుకో ! కడవరకు నిన్ను తన హృదయంలో వుంచుకొని కాపాడగలిగేవాణ్ణి నీ జీవిత భాగస్వామిగా ఎంచుకో! అన్నీ తెలిసిన నీకు మీ అమ్మ ఇంకేం చెప్పలేదు... బీచికి వెళ్ళి తొందరగా వచ్చేయి" కూతుర్ని హెచ్చరించింది పార్వతమ్మ.

# చుక్కలు!

నిశిలో జాబిలి కోసం
మిణుకుమిణుకు మంటూ కోటి చుక్కలు
రాని వాన కోసం
రేపులో - నీటి చుక్కలు
తాగుబోతు మొగుడి కోసం
పెళ్ళాం కళ్లలో - కన్నీటి చుక్కలు.
విలాస కేళిలో తేలియాడడం కోసం
రసికుడి వొళ్ళపై - పన్నీటి చుక్కలు
పై చుక్కల వైనం తెలపడం కోసం
ఈ నా - సిరా చుక్కలు!

— ఎస్. సంజీవ్

"సరేనమ్మా నీవు చెప్పినట్లే చేస్తాను; ఇంత మంచి అమ్మ దొరకడం నా అదృష్టం' తల్లి నుదుటిపై ప్రేమగా ముద్దుపెట్టుకుని బీచికి బయల్దేరింది మేనక. బీచిలో —

"మీ అమ్మ మంచి సలహాయే ఇచ్చింది మేనకా! మనసా వాచా నీకు ప్రమాణం చేస్తున్నాను. నేను బ్రతికి వున్నంతకాలం నిన్ను పువ్వుల్లో పెట్టి పూజిస్తాను, ఇది నిజం. నీ అందం కాదు నాకు కావల్సింది నీ మనసు" చేతిలో చెయ్యి వేశాడు ఇంద్రమోహన్. మేనక తృప్తిగా అతని కళ్ళలోకి చూసింది

* * *

కాలేజి ఆవరణలో –

"ఇంద్రా ! కంగ్రాట్యులేషన్స్ ! నీ పెళ్లి మేనకగారితో నిశ్చయమైనందుకు మా కందరికి ఎంతో ఆనందంగా వుంది. మాకు అందరికి గొప్ప పార్టీ ఇవ్వాలి" అభినందించాడు, రఘు హిస్టరి లెక్చరర్.

"తప్పకుండా." ఇంద్రమోహన్ చుట్టూ వున్న లెక్చరర్లందరికి ప్రామిస్ చేశాడు. "ఇంతకీ మేనక రాలేదేమబ్బా! కాలేజి బెల్ కూడా కొట్టేశారే," అనుకుంటుండగా —

ఆఫీసు బాయ్ పరుగు పరుగున వచ్చాడు. ఇంద్రమోహన్‌ను ఉద్దేశించి "సార్ ! సార్ ! మేనకమ్మగారికి ఫైర్ ఏక్సిడెంట్ అయిందట. స్టౌ ముట్టిస్తూంటే మంట పైకి ఎగసి..." చెప్పలేక రొప్పుతున్నాడు.

ఇంద్రమోహన్ ఒక్కసారిగా షాక్ తిన్నాడు. వెంటనే స్కూటర్ వేసుకుని మేనక ఇంటికి బయల్దేరాడు.

* * *



రాక్షసిని చూసినట్లు గట్టిగా అరిచాడు ఇంద్రమోహన్ మేనక రూపాన్ని చూసి. మేనక ముఖం వికృతంగా కాలి బొబ్బలెక్కిన గాయాల్తో నీరు కార్తూ కుష్ఠురోగిలా తోచింది ... "నో! నో! నువ్వు నా మేనక కాదు ... నాక్కావల్సింది ఈ మేనక కాదు" పిచ్చిగా అరిచాడు.

"మరి మన పెళ్ళి!" దీనంగా అన్నట్టున్నాయి మేనక చూపులు. పార్వతమ్మ కొంగు నోటిలో కుక్కుకొని ఏడుస్తూవుంటే—

"నో! నిన్నిక పెళ్ళి చేసుకోలేను. నాకా విశాల హృదయం లేదు. నన్ను క్షమించు మేనకా ... నన్ను క్షమించు." వడి...వడిగా వీధిలోకి నడిచాడు ఇంద్రమోహన్.

* * *

"స్టార్ట్ ఇమీడియట్లీ ఫైర్ యాక్సిడెంట్ టు మేనక," టెలిగ్రామ్ చదువుకున్న సుందర్‌కు కంపరమెత్తింది. ఏకాఎకిన బయల్దేరాడు. బస్సులో అతను చేసిన 6 గంట ప్రయాణంలోను అతను పడిన మానసిక బాధ వర్ణనాతీతం ...

ఇల్లు చేరేసరికి అప్పుడే చక చక మెట్లు దిగి వీధిలోకి వస్తూన్న ఇంద్రమోహన్ కనిపించాడు. "ఏమైంది మేనకకు?" ఆత్రుతతో ప్రశ్నించాడు సుందర్. అతనికి జవాబివ్వకనే, స్కూటర్ 'స్టార్ట్' చేసుకొని వెళ్ళిపోయాడు ఇంద్రమోహన్.

గబగబా మెట్లెక్కి "ఏమైందక్కయ్యా మేనకకు? అసలీ ఘోరం ఎలా జరిగింది?" ఎదురుగా వచ్చిన పార్వతమ్మను కుదిపేస్తూ అడిగాడు.

పార్వతమ్మ మౌనంగా మేనక గదివైపు నడిచింది.

మేనకను చూసి బావురుమన్నాడు సుందర్. "బావా! ఏడవకు బావా! నా గర్వమంతా తగ్గిపోయింది. అందంతోపాటు అదీ కాలి మాడిపోయింది. ఇప్పుడు నేను ఎవరికీ పనికిరానిదానను. నాకు మాటిచ్చి తప్పాడు నేను నమ్ముకున్న ఇంద్రమోహన్. బాహ్య సౌందర్యంకన్న అంతర్ సౌందర్యము ముఖ్యం అన్నమాటలే నా చుట్టు ప్రతిధ్వనిస్తూ వున్నాయి... బావా నేను కాదన్నా నాపైన నీవు ప్రేమ చూపావు. ఇప్పుడు అదే ప్రేమతో కళ్ళు నీళ్ళు పెట్టుకుంటున్నావు. చాలు బావా నాకీ ప్రేమచాలు. ఇక నా జీవితం అంతమయినా పర్వాలేదు. అసలు బ్రతికున్నా నన్నెవరు చేసుకుంటారు?" విషాద వదనంతో అంది మేనక.

"అంత మాటనకు మేనక... నే నేనాడో చెప్పాను. నా మనస్సు మారదని... నేను అంతః సౌందర్యాన్నే ప్రేమిస్తానని... నీవు వాదానివే! ఎప్పటికైనా... నిన్ను నేను విడిచిపెట్టను మేనకా! విడిచిపెట్టను." మేనక చేతిని చేతిలోకి తీసికొని అన్నాడు.

"నిజంగానా బావా!" అంత బాధలోను మేనక మొహంలో నవ్వు విరబూసింది. కృతజ్ఞతతో ఆమె కళ్ళు వెలిగాయి.



"అక్కయ్యా! టాక్సీ పిలుచుకొని వస్తా! నీవు జాగ్రత్తగా మేనకను చూస్తూండు. డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళుదాం." పరుగు పరుగున బయటకు వెళ్ళాడు సుందర్.

"చూశావామ్మా సుందర్ హృదయం ఎంత సుందరమైనదో!" మేనకను చూస్తూ అంది పార్వతమ్మ.

* * *

కాలేజి లెక్చరర్స్ రూమ్‌లో ఇంద్రమోహన్ తోటి లెక్చరర్లతో బాతాఖాని కొడుతున్నాడు. అప్పటికి మేనక కాలేజికి వచ్చి రెండురోజులు అయ్యింది. "పెళ్ళి కాకముందే మేనకకు అలా కావడం మంచిదైపోయింది. లేకపోతే నీ జీవితం అంతా పాడైపోయి వుండేది!" అందరు లెక్చరర్లూ తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

ఇంతలో మేనక ఆ గదిలోకి వచ్చింది. వయ్యారంగా — అచ్చు అప్సరసలా — కలహంసలా — తెల్లని వెన్నెలలా—సెలయేరులా—గలగల నవ్వులతో వచ్చింది. ఇంద్రమోహన్‌తో బాటు అందరూ ఆశ్చర్యపోయారు. ఎప్పటిలా మేనక అందంగా వుంది. కాలిన మచ్చలు కూడా లేవు. నోటి మాట కూడ రాలేదు ఎవ్వరికి.

విస్మిత్తులై చూస్తున్న వార్నుద్దేశించి మేనక అంది—"నాకు తెల్సు మీరంతా నోళ్ళు వెళ్ళబెడ్తారని, నాకేం కాలేదు. ఫైర్ యాక్సిడెంటూ లేదు ... యాక్సిడెంటల్ ఫైరూ కాదు. మా అమ్మ సలహా అనుసరించి ఓ అయిడియా వచ్చింది. వెంటనే మా అమ్మ సహకారంతో ఆచరణలోకి పెట్టాను

అందుకే అలా నటించాల్సి వచ్చింది. నేను పెట్టిన ఈ పరీక్షలో ఇంద్రమోహన్ ఓడిపోయాడు. మా బావ సుందర్ గెలిచాడు. అతని మనస్సు సుందరమని తెల్సి, కడవరకు మిగిలేది అనురాగ అనుబంధాలేకాని పైకి కన్పించే అందాలు శాశ్వతం కాదన్న సత్యాన్ని మా అమ్మ జీవితం ద్వారా, ఈ పరీక్ష ద్వారా తెల్సుకున్నాను. అందుకు మా అమ్మకు ఎంతో ఋణపడివున్నాను. మేకప్ చేసుకోడానికి పది రూపాయలు ఖర్చు కాకపోతే ఇంద్రమోహన్‌ను చేసుకొనివుంటే నా జీవితమే ఖర్చు అయిపోయేది... బై ది బై... నాకు మా బావకు నెక్స్ట్ వీక్ పెళ్ళి... పిలవటానికే ఈ రోజు వచ్చాను. ఈ రోజునుంచి లీవు పెడుతున్నాను... మళ్ళీ రాలేకపోవచ్చు. మీరందరూ తప్పక రావాలి... మీరుకూడ మోహన్‌గారూ!" "మోహన్‌గారు" అన్న పదాన్ని వత్తిపలుకుతూ ఇంద్రమోహన్ వైపు చూసింది. అసలు విషయం తెల్సుకున్న ఇంద్రమోహన్ సిగ్గుతో తల దించుకున్నాడు. అందరికి శుభలేఖలు పంచింది. మరోసారి అందర్ని ఆహ్వానించి గది బయటకు నడిచింది.

అందరూ విస్తుపోయి చూస్తూండిపోయారు.






చాలా కథల్లో వర్ణించినట్టుగానే వాల్తేరు స్టేషను పెళ్ళివారిల్లులా కళకళ్ళాడుతోంది. ముస్తాబై ముహూర్తం కోసం ఎదురుచూసే పెళ్ళి కూతుర్లా గోదావరీ ఎక్స్‌ప్రెస్ ప్లాట్‌ఫాంమీదవుంది

"నే వుంటానమ్మా. జాగ్రత్త సుమీ. వెళ్ళగానే ఉత్తరం రాయి."

ఈ మాటలు పార్వతీశంగారివి.

"అలాగే నాన్నా. రిజర్వేషన్ కంపార్టుమెంటు. భయమేముందీ. తెల్లారితే ఆయనెలాగూ సికింద్రాబాద్ స్టేషనుకొచ్చి రిసీవ్ చేసుకుంటారాయె" అంది త్రిపుర. త్రిపుర పార్వతీశంగారి ఏకైక పుత్రిక.

గార్డు పచ్చజెండా ఊపేడు.

పార్వతీశంగారు చెయ్యి వూపేరు.

గొన్ను తొడిగే వయసులో కాబోలు ఆయన త్రిపురకు టాటా చెప్పడం నేర్పేడు. ఆడపిల్ల! పుట్టింట్లో కూర్చుంటుందా? ఎప్పుడో ఒకప్పుడు టాటా చెప్పక తప్పదుమరి!

పార్వతీశంగారి గుండెల్లో దిగులు గూడు కట్టుకుంది.

"నేనుత్తరం రాస్తాగా — మీ ఆరోగ్యం జాగ్రత్త" అంటూ తండ్రి కళ్ళలోని దిగులు చూసి చెయ్యి వూపింది త్రిపుర.

ఒక్క వూపుతో బండి కదిలి, కాస్సేపట్లోనే పరుగు లంకించుకుంది. గతాన్ని మరచి, కాస్సేపు భవిష్యత్తులో సంచరించి, వర్తమానంలోకి వచ్చింది త్రిపుర. రిజర్వేషన్ కంపార్ట్‌మెంటు ఆట్టే రద్దీగా లేదు. ఎదుటి సీట్లో ఓ వయసు మళ్ళినావిడా, ఓ పదేళ్ళ పిల్లా కూర్చున్నారు. వాళ్ళచేతిలో చిన్నసంచీ తప్ప మరేంలేదు. బహుశః ఏ అనకాపల్లిలోనో దిగిపోతారు కాబోలు — అనుకుంది త్రిపుర.

రైలు వేగాన్నందుకుంది.

సూట్‌కేస్ తెరిచి, బెడ్ షీట్ పరుచుకుని కాలక్షేపానికి కొనుక్కున్న పత్రిక తీసింది — ఒక్కమారు ... దిగులు చూపులతో తనను సాగనంపిన తండ్రి కళ్ళముందు మెదిలాడు.

పెళ్ళయిన యీ రెండేళ్ళలోనూ ఎన్నో మార్పులా ...

పుట్టింట్లో తనెలా గారాబంగా పెరిగిందీ; కాలేజీ, స్నేహితులూ మొదటి పెళ్ళిచూపుల్లోనే తన భవిష్యత్తు నిర్ణయమైపోవడం; ఆయన, అక్కడి అనురాగ పూరితమైన వాతావరణం ... అన్నీ త్రిపుర కళ్ళముందు మెదిలాయి.

అనకాపల్లిలో బండి ఆగింది — అనుకున్నట్టుగానే ఎదుటి సీటుమీద కూర్చున్న ఆమె, పిల్లా దిగిపోయారు. కిటికీ ప్రక్కనున్న రెండు సింగిల్ సీట్లలో ఓ వయసు మళ్ళిన దంపతులు కూర్చుని, హిందీలో ఏదో చర్చించుకుంటున్నారు.

బండి బయల్దేరింది. ఆలోచనలు మాని వారపత్రికలో తల దూర్చింది త్రిపుర. ఆ వారం ఎనిమిది కథలు వేశారు. అన్నీ చెయ్యి తిరిగిన రచయితలు వ్రాసినవే. రెండు ఆకలి కథలూ, మూడు ప్రేమ కథలూ, మరో మూడు స్త్రీల సమస్యలపై అల్లిన కథలూ. టైటిల్సును చూసే పోల్చుకుంది త్రిపుర.

రెండు ఆకలి కథలూ పూర్తిచేసేసరికి బండి యలమంచిలిలో ఆగింది. కొంచెం ఆకలి కూడ వేస్తున్నట్టయి తను తెచ్చుకున్న పేకడ్ ఫుడ్ కోసం బ్యాగ్ తెరిచి రెండు బిస్కెట్ పేకెట్లను తీసి; ఎదుటి బెర్తుమీదికి ఎవరో వచ్చినట్లయితే తలెత్తి చూసింది.

ముక్కుపొడుం రంగు ప్యాంటుమీద పాలమీగడలాంటి లాల్చీ, చేతికి హెచ్.యమ్.టి. తరుణ్‌వాచీ, కాస్త ఒత్తుగా పెరిగిన వంకీల జుట్టూ, కళ్ళకి నప్పిన నల్లఫ్రేంతో అద్దాలూ ...

అతను సామాన్లు మీది బెర్తుమీద సర్ది వెనుదిరిగి కూర్చోబోతూ ఆమెను చూశాడు. రెండు చూపులూ కలిసి గతుక్కుమన్నాయి.

"త్రిపురా ... నువ్వా ... !" అన్నాడతను ఆశ్చర్యంగా.

అవునన్నట్టు తలూపి నవ్వింది త్రిపుర.

"ఏం? అంత పోల్చుకోలేనంతగా మారిపోయానా?" అని ఆమె అనకపోవడం అతనికి ఆశ్చర్యాన్ని కలగజేసింది.

అతని పేరు చక్రవర్తి. చాల కథల్లోమాదిరిగానే చక్రవర్తీ, త్రిపురా కల్సి చదువుకున్నారు. కల్సి పార్కులకెళ్ళేరు. కల్సి సినిమాలకెళ్ళేరు — అలాయింకా కల్సి...జీవితాల్ని కలిపేసుకోవాలనుకున్నారు. కానీ కుదర్లేదు. చక్రవర్తికి ఉద్యోగం దొరక్కముందే త్రిపురకి భర్త దొరికేడు. అందుకే యిద్దరూ ప్రేమికులుగానే మిగిలిపోయారు.

అప్పటికప్పుడు మళ్ళీ —

'అప్పటికీ యిప్పటికీ త్రిపురలో ఎంత మార్పు!' అనుకున్నాడతడు.

'స్త్రీకి పెళ్ళి పరిపూర్ణతనిస్తుందిట' — ఏదో కథలో చదివేడు. ఒకప్పుడు చాల ప్రేమ కథలు చదివేడు చక్రవర్తి. జయబాధురీ నటించిన సినిమాలు చూసేవాడు. 'ప్రేమ ప్రేమను ప్రేమిస్తుంది' అనుకునేవాడు. మరో కథతో ఆ అభిప్రాయాన్ని మార్చుకుని, నిజమైన ప్రేమ త్యాగాన్ని కోరుతుంది అని రూఢి చేసుకున్నాడు. ఆ తర్వాత ఆ త్యాగమే తను చేశాననుకున్నాడు.

"ఏమిటలా వుండిపోయావ్! ఎంత బాగా మాట్లాడేవాడివి. కథలుకూడ రాసేవాడివి గదూ? నన్ను చూస్తే మాటలే కరువయ్యాయేమిటి?" అంది త్రిపురే కల్పించుకుని — ఆమె అప్పటికే చాలసేపు చూసింది అతనే మాట్లాడతాడని. ఆమె అంతకుముందు చదివిన కథలో ప్రియుడే ప్రియురాల్ని ముందు పలకరిస్తాడు. "అప్పటికన్నా పెళ్ళయ్యాక యిప్పుడే బాగున్నావ్ సుమా! కాస్త ఒళ్ళుకూడ చేసేవ్" అంటాడు. ప్రియురాలు సిగ్గుతో తలొంచుకుంటుంది.

తలెత్తి త్రిపురవంక చూశాడు చక్రవర్తి.

అవును — ప్రేమ వ్యవహారం ముదిరేక, కథలు చదివీ చదివీ, సినిమాలు చూసీ చూసీ తనూ ప్రేమ కథలు కొన్ని రాసేడు. కానీ నిజంగానే యిప్పుడు మాటలు కరువయ్యేయి. అది వూహాలోకం — ఇది వాస్తవం... మరి!

'త్రిపుర యిప్పుడే బాగుంది' అనుకున్నాడు. ఆ భావం వ్యక్తపరచడానికి నోరురాలేదు. సంస్కారం అడ్డేసింది. కానీ కథలో అన్నాడు — అంటే... ఆ అమ్మాయి నవ్వింది — ప్రేమచూపులు చూసింది.

నిజానికలా చూస్తుందా?

"ఏం మాట్లాడనూ? నిన్ను చూస్తే నా ఆలోచనలు వెనక్కు వెళ్ళాయి!" అన్నాడు ఆమె ప్రశ్నకు జవాబుగా.

చిన్నగా నవ్వి తలొంచుకుంది త్రిపుర. ఆ

సిగ్గులో ఆకర్షణ వుంది — ఆ నవ్వులో ఆకర్షణ వుంది — నవ్వితే సొట్టలుపడే ఆ బుగ్గల్లో ఆకర్షణ వుంది.

''భలేవాడివే! అప్పటి మన ప్రేమ గురించి ఆలోచిస్తున్నావా ? ఇంతకీ నీ పెళ్ళికి నన్ను పిలిచేవుగాదేం ? మీ ఆవిడ బావుంటుందా ?'' అని త్రిపుర అడుగుతుందేమోననుకున్నాడు. అలా ఆమె అడిగితే సూటిగా జవాబు చెప్పకుండా —

''నాలుగేళ్ళ క్రితం మనం ఆఖరిసారిగా కలుసుకున్న సాయంత్రం నేను నిన్నడిగిన ప్రశ్నకు నువ్వు చెప్పిన సమాధానం గుర్తుందా ?'' అని అడగాలనుకున్నాడు.

త్రిపుర యేం మాట్లాడకపోవడం చక్రవర్తికి ఆశ్చర్యాన్ని కలిగించింది.

''ఎంత వరకూ ప్రయాణం ?'' అడిగేడిక ఉండబట్టలేక.

''మేమిప్పుడు హైదరాబాద్‌లోగా వుంటున్నదీ. ఆయనేదో కాన్ఫరెన్సుకి ఢిల్లీ వెళ్ళారు. ఈలోగా అమ్మావాళ్ళని చూసొద్దామని నేను విశాఖపట్నం వెళ్తొస్తున్నాను'' అంది.

''అదృష్టవంతురాలివే'' అందామనుకున్నాడు. కాని సందర్భం కుదర్లేదు — ధైర్యం చాల్లేదు. మునుపు త్రిపురతో చాల చనువుగా వుండేవాడు. ఇప్పుడా చనువు తీసుకోలేకపోతున్నాడు. నిజానికా చొరవ ఆమే యివ్వటంలేదనిపిస్తోంది.

''మరి నువ్వెంతవరకూ ?'' అడిగింది.

ఆ ఒక్కముక్క ప్రశ్నలో ఎంత జవాబు నాశిస్తోందో మరి !

''నేనూ మీ వూరికే. ఊరికినే మట్టుకుకాదు సుమా. సెలవులకి పిల్లల్ని మామగారు తీసుకెళ్ళేరు. చూసొచ్చినట్టూ అవుతుంది, ఆఫీసు పనీ చక్కబెట్టినట్లవుతుందని బయల్దేరా'' అని, జేబులోని సిగరెట్ తీసి లైటర్‌తో అంటించాడు.

అతని వంక ఆశ్చర్యంగా చూసింది త్రిపుర.

''ఇదెప్పటినించీ నేర్చుకున్నావ్ — మునుపు నీకీ అలవాటు వుండేదికాదు. సిగరెట్లు కాల్చటం ఆరోగ్యానికంత మంచిది కాదు. మెడికల్ రిప్రజెంటేటివ్‌వి, నీకా మాత్రం తెలీదూ ...'' అంటూ మెత్తగా శాసిస్తుందనుకున్నాడు.

అవునుమరి ! జీవితంలో ఒకసారి ప్రేమించిన ఆడది జీవితాంతం శాసించగలదని ఎక్కడో చదివేడు.

అలా ఆమె అడిగితే తను చెప్పబోయే సమాధానాన్నికూడ రెడీగా పెట్టుకున్నాడు, 'మీ ఆయన కాల్చడేమిటి ?' అని.

కానీ, ఆ అవకాశాన్నికూడ త్రిపుర యివ్వలేదు. బిస్కెట్ల పేకెట్ విప్పి; ''మీ వూర్నించి భోజనం చేసే బయల్దేరొచ్చినుకుంటా'' అంది.

''చెయ్యొచ్చు — కాని నాకు ప్రయాణాల్లో భోజనం పడదు — లైట్‌గా టిఫిన్. అంతే.'' అని; ఎయిర్‌బేగ్‌లోంచి ఏంప్రూ బిస్కెట్లు తీశాడు.

'రెండు తీస్కో' అంటూ చెయ్యిచాపింది త్రిపుర.

''మరి నువ్వుకూడ'' అంటూ చక్రవర్తి కూడ పేకెట్ అందించాడు.

టిఫిన్ అయ్యాక కాస్సేపు ఏవేవో మాట్లాడింది త్రిపుర — రాజకీయాలూ, సంగీతం, సాహిత్యం, నేటి తెలుగు సినిమాల్లో పాటల అధోగతి.

ఆమె మాటలు, ఆ వెనుక భావాలూ ఆమె ఎదుగుదలకు నిదర్శనమవుతున్నాయి.

ఆ మాటల్లోనే తన భర్త గొప్పదనం గూర్చి యేమైనా చెబుతుందేమోనని చూశాడు చక్రవర్తి. చాల కథల్లో అతనలాంటి సన్నివేశాల్ని చదివేడు. ప్రియుడి ముందు భర్త గొప్పను నిరూపిస్తుంది హీరోయిన్. దానికా ప్రియుడు నొసలు చిట్లించి తన భార్య గురించి కూడ ఏమేమో చెబుతాడు. ఆమె అందాలరాశి; సుగుణవతి; ఆంధ్రుల అభిమాన కవయిత్రి... అని యింకా ఏవేవో...

త్రిపుర ఆ విషయాలను తెస్తే తనెలా మాట్లాడాలనేదీ రిహార్సల్ వేసుకున్నాడు చక్రవర్తి మనసులోనే. కానీ త్రిపుర ఆ ప్రసక్తే తేలేదు — కనీసం 'నా భర్త పేరిది — నీ భార్య పేరేమి ? ఆపరేషన్ అయ్యింది. మీ కయ్యిందా ?' అనేనా అడగలేదు.

గోదావరి ఎక్స్‌ప్రెస్ గోదావరిని సమీపించింది.

వెన్నెట్లో గోదారి పడుచు కోరికల్లా పరవళ్ళు తొక్కుతూ శోభన సుందరిలా వింతసోయగంతో వుంది.

కంపార్ట్‌మెంట్లోని వారంతా గోదావరి తల్లికి పైసలేసి దండాలు పెట్టేరు. త్రిపుర కూడ లేచి తనమీదుగా వంగి గోదావరిని చూస్తుందేమోనను కున్నాడు చక్రవర్తి. ఆమె అలా చేయలేదు. ''నాగరికత పెరిగినా యీ మూఢ విశ్వాసం పోలేదు మనుషుల్లో'' అన్నాడు ఆమెకు వినపడేలా. త్రిపుర ఏం మాట్లాడలేదు. రెప్పవాల్చకుండా వెన్నెల్నీ, గోదారినీ చూస్తూనే వుండిపోయింది.

''ఈ దృశ్యం చాల బాగుంది కదూ ?'' అన్నాడీమాటు. అతి నెమ్మదిగా ఆమె చెవిలో అంటున్నట్లే.

తల తిప్పి; అవునన్నట్లు కళ్ళతోనే జవాబు చెప్పింది.

కాస్సేపట్లోనే బండి గోదావరిని దాటి పరుగు పెట్టింది.

''ఈ నదుల అందాల్ని చూసి పరవశించే కృష్ణశాస్త్రిగారు పాట రాశారు. ఒక మంచి అనుభవం కవికి ఉత్తేజితం కలుగజేస్తుంది. ఆ ఉత్తేజంలోంచి వెలువడే ఏ రచనైనా చిరకాలం బ్రతికి వుంటుంది'' అంది త్రిపుర.

ఆమె భావుకతకు అబ్బురపడ్డాడు చక్రవర్తి.

''ఏ పాట అదీ ?''

''నువ్వు విన్లేదూ ? నాకిష్టమైన పాటల్లో అది ఒకటి. విన్పిస్తానుండు'' అంటూ పాకెట్ సైజు జపాన్ టేప్ రికార్డరు సూట్‌కేస్‌లోంచి తీసి కేసెట్ అమర్చి ట్యూన్ చేసింది.

''తరలి రావమ్మా ...
గౌతమీ మంజీరా ... నాగావళీ ...
ఓ ... వంశధారా ...
..................
నురుగుల ... ముత్యాల చెరగుల
తరగ మడతల పావడాతో ...
..................
మంజరులు ఝురులా సోయగంతో ... ''

ఆ పాటకు మైమరచిపోయాడు చక్రవర్తి. అప్పటికే కంపార్ట్‌మెంట్లోని వారంతా పక్కలు పరుచుకుని నిద్దరోతున్నారు. ఒకరిద్దరు మాత్రం పాట వింటూ కూర్చున్నారు.

టేప్ రోల్ అవుతూనే వుంది —

చక్రవర్తి బెడ్‌షీటు తీసి పరుచుకుని మేను వాల్చాడు.

కృష్ణశాస్త్రి కృతులెన్నో భావయుక్తంగా సంగీతంలో కలిసి విన్పిస్తున్నాయి—

చక్రవర్తి కళ్ళు మూతలు పడుతున్నాయి.

టేప్ రికార్డర్ ఆపి తనూ పక్క పరుచుకుంది త్రిపుర.

అంతా ఎవరి బెర్తుమీద వారు నిద్రపోతున్నారు

రైలు వేగాన్ని పుంజుకుంటూ పరుగెత్తుతూ వుంది.

పుస్తకం తీసి పడుకునే చదవడం మొదలుపెట్టింది త్రిపుర.

... ... ... ... ...

రైలు వేగాన్ని పుంజుకుంటోంది. వయసు కోరికలు అతనిని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. ఎదురుగా ఒకనాటి ప్రియురాలు ! అందంగా, ఆకర్షణీయంగా, మగతగా... ఒంటరిగా... అవును !... చుట్టూ అంతా నిద్రపోతున్నారు — ఆమెలోని ఆకర్షణ అతని నరాల్ని కాల్చేస్తోంది. ఒళ్ళంతా సెగలు... కళ్ళలో జ్వలిస్తున్న కోర్కె... ఈ అందాలరాశి తను జారవిడుచుకున్న అదృష్టదేవత ! ఆ అదృష్టదేవతే మళ్ళీ యీనాడు తన హృదయ కవాటాన్ని తట్టిందని ఎందుకనుకోకూడదు ?

లేచి; ఆమెపైకి వంగి, చూపుడువేలితో ఆమె పెదవులపై మెత్తగా రాసి... ... ...

చటుక్కున లేచి చక్రవర్తి వంక చూసింది త్రిపుర. ఆవేశంతో ఒళ్ళు వేడెక్కింది. ఎదుటి బెర్తుమీద గుర్రుపెట్టి నిద్రపోతూ కన్పించాడు చక్రవర్తి.

ఒక్క నిట్టూర్పు విడిచి; 'కథలు కథలే...' అనుకుంది.

ప్రియురాలని వెంటబడి చేయకూడనిదేదో చేయబోతే... పెళ్ళయిన ప్రియురాలు మెత్తగా మందలించడమో; అతని స్థితికి జాలిపడి ప్రేమ గుర్తుగా సాయం చేయడమో; లేదా అందమూ సంస్కారమూ వున్న స్త్రీ చనువుగా మాట్లాడితే వల్లో పడిందని వెంటబడితే...రైలు దిగి 'అన్నయ్యా' అనడమో... కథల్లోనే యిటువంటివి జరుగుతూంటాయి కాబోలు ! కథల్లోని వాతావరణమే ఉన్నా వాస్తవంలో ఆ సంభాషణలుండవు... ఎందుకనో మరి !

ఆలోచనలోపడింది త్రిపుర.

తలక్రింద దిండులేక చెయ్యి నెప్పెట్టి కదిలిన చక్రవర్తి కళ్ళిప్పి త్రిపురను చూసి; ''నువ్వింకా నిద్రపోలేదా ?'' అన్నాడు.

నవ్వి; ''ఇంకా లేదు'' అంది త్రిపుర సమాధానంగా.

... ... ... ... ...

''... ... మీ ఆయనగారిని గుర్తుకొస్తున్నాదేమిటి ?''

''లేదు — మన ప్రేమ; అప్పటి ఆ అనుభ



'నాంపల్లి నాగు'లో ఒక సన్నివేశం

వాలా జీవితంలో మధురమైన, జారవిడుచుకున్న ఆ క్షణాలూ ''

చదువుతున్న కథలో పేజీ మారినట్లు గమనించింది త్రిపుర —

జీవితపు తొలి రోజుల్లో మధురానుభూతు లనుకున్నవి వయసు వికసించాక, మేధస్సు పెరిగి వివేకం మొగ్గలు తొడిగాక, ఎంత పేలవంగా కన్పిస్తాయో అర్థమైంది త్రిపురకు — అప్పట్లో తొందరపడకపోడం, తెగింపులేక పెద్దలమీద భయం తోనే మౌనంగా రాజీకి రావడం ఆలోచిస్తోంది!

చక్రవర్తి మరో మారు కళ్ళు విప్పి మూసు కున్నాడు

''చెయ్యి నెప్పి పుడుతుంది — మళ్ళీ దిండు తీసుకో — నా కలవాటే'' అందించిందామె దిండు కవరుమీద స్వీట్ డ్రీమ్స్!

ఫారెన్ యింటిమేట్ సెంటూ, మల్లెపూల పరిమళమూ కలిసి ఒక్కమారు అతన్ని ఉక్కిరిబిక్కిరి చేశాయి

ఆమె యీ దిండుమీద ఎన్ని అనుభూతుల్ని పొందిందో! ఎన్ని స్వప్నాల్ని కన్నదో!

# మామూలు కథ

కళ్ళెత్తి మళ్ళీ చూశాడు చక్రవర్తి పరిసరాల్ని లెక్కచేయకుండా దిండుమీద సుఖంగా పడుకుని చదువుకుంటోంది త్రిపుర

కథలో ప్రేయసికిమల్లే వాస్తవంలో ఉండదా?

ఒక మగాడు అందులోనూ ఒకప్పటి ప్రియుడు దిండులేక యిబ్బంది పడుతున్నాడని తెల్సి ఇన్ని కథలూ చదివి, యిన్ని సినిమాలు చూసినా ఛ! యీ ప్రియురాళ్ళిక మారరు అనుకుని గట్టిగా కళ్ళు మూసుకున్నాడు చక్రవర్తి

* * *

కళ్ళు తెరిచేసరికి ఎదురుగా త్రిపుర! గుండ్రటి చిన్న అద్దంలో తిలకం దిద్దుకుంటూ — గబుక్కున లేచి కిటికీలోంచి చూశాడు — తూర్పు తెల్లబడుతోంది!

తెల్లవారుఝామున పెళ్ళికి ముస్తాబవుతున్న పెళ్ళికూతుర్లా దూరంగా సికింద్రాబాద్ స్టేషన్ కన్పిస్తోంది

పోనీ లేపితే ఏం పోయింది? అనుకుంటూ టాయ్‌లెట్‌లోకి నడిచాడు తను దిగాల్సింది నాంపల్లిలో

తిరిగి వచ్చేసరికి దిగడానికి రెడీగా వున్నట్లు కూర్చుంది త్రిపుర

'ఏమిటి సంగతులూ' అన్నాడు ఎదురుగా కూర్చుంటూ అంతవరకూ చెప్పనివేవో తెలు స్తుందని ఆశ! ఇంకా నీ మీద ప్రేమ, అభిమానం ఉన్నాయని చెప్పడానికి మాటలేవైనా అల్లు తోందేమోనని

''ఏమున్నాయ్ మామూలే — మా వూరొచ్చే సింది'' అంది ఆ మాటలో 'మా ఆయనొస్తాడు స్టేషన్‌కి' అన్న ఉత్సాహం కన్పించింది

'తన నుండి ఏమైనా ఆశిస్తున్నాడా?' అను కుంది త్రిపుర 'పోనీ మగాడూ, ఒకప్పటి ప్రియుడూ చెప్పరాదూ? ఎడ్రసు యిచ్చి ఉత్తరాలు రాయమంటాడేమో'

బండి ఆగింది —

సూట్‌కేసూ, ఎయిర్ బేగూ తీసుకుని లేస్తూ ''వస్తానూ'' అంది త్రిపుర తన భర్తని పరిచయం చేయడం యిష్టంలేదు కాబోలు అనుకున్నాడు చక్రవర్తి

ఆమె దిగాక, తన సామాను చూసుకున్నాడు అందులో ఏ ఉత్తరమన్నా కన్పిస్తుందేమోనని తర్వాత నిరాశపడ్డాడు

ఏ బంధాలూ లేకుండా బయల్దేరిన రైలు బండి అతి మామూలుగా నాంపల్లిలో ఆగింది ★

# సమృద్ధమైన పంటలకు



## అనువైన ఎరువులను సమర్థవంతంగా ఉపయోగించండి






మీ వేరుశనగ పంటకు విజయ్ 14-28-14 సరియైన ఎరువు.

సిఫార్సుచేసిన ఎరువుల మోతాదు.

| | ఎకరానికి కిలోలలో దుక్కిలో | |
|---|---|---|
| పంట | విజయ్ 14-28-14 | మ్యూరేట్ ఆఫ్ పొటాష్ |
| వర్షాధారపు వేరుశనగ | 45 | 10 |

పైసిఫార్సుచేసిన ఎరువులను ధుక్కిలో 5 సెం.మీ లోతుగానూ, వి త్తనాలకు 5 సెం. మీ ప్రక్కగానూ పడేట్లు వేయాలి. ఈ విధంగాఎరువులను, వి త్తనాలను ఒకేసారి వేయడానికి వీలైన గొర్రులునాయి.

ఇటువంటి గొర్రులు లభించనప్పుడు, మీరు రెండు మామూలు నాగళ్ళను వుపయోగించవచ్చు. ఒక నాగటిచాలులో 5 సెం. మీ లోతుగా వి త్తనము వేస్తూ చాలును కప్పుతూ పోవాలి. రెండవ నాగలిని ఈ చాలుకు 5 సెం. మీ ఎడంగా తోలుతూ 5 సెం. మీ లోతున ఎరువులు పడేట్లు వేయాలి.

ఇంకా వివరాలకు ఈ క్రింది చిరునామానుండి ఈ పంటకు సంబంధించిన పు స్తకము తెప్పించుకొని తెలుసుకోండి.

## పైర్ల సరియైన పోషణకు
# విజయ్



ఏరియా మేనేజర్
మద్రాసు ఫర్టిలైజర్సు లిమిటెడ్
44, కాంతినగర్
హైద్రాబాద్-500 028




HTM-MFL-2492

రెండు రోజులు శెలవు దినాలు రావటం మూలంగా ఎగ్జిబిషన్ జనంతో కిటకిటలాడి పోతోంది.

ఎగ్జిబిషన్‌లో ఒక జయింట్‌వీల్‌కి బదులు ఈసారి మూడు జయింట్‌వీల్స్ పెట్టారు నాలుగు రంగులరాట్నాలు పెట్టారు రైల్వే వారు, ఆర్టీసీవారు పెట్టిన స్టాల్స్ ఎగ్జిబిషన్‌లో మంచి ఆకర్షణ. రైల్వేవారు పెట్టిన "టెలిఫోన్, టెలివిజన్"లో క్రొత్తగా కలిసిన స్నేహితుల జంటలు, ఒకరినొకరు చూసుకొని ఎంతగా మురిసిపోతున్నారో చెప్పనవసరంలేదు. పెళ్ళైతే సరేసరి వారి ఫోటోలు వారు చూసుకోవటం కాకుండా, తమ కిష్టమైన వారి ఫోటో టెలివిజన్, టెలిఫోన్‌లో చూచి నప్పుడు వారి ఆనందానికి అంతుండదు ఇక కొత్త దంపతులైతే వారి ముఖాల్లో సిగ్గు మొగ్గలు వేస్తాయి ముసలి దంపతులు ఒకరి నొకరు చూచుకొని, తమ పెండ్లి రోజులు గుర్తుకు తెచ్చుకునేవారు. అర్ధ రూపాయి ప్రవేశ రుసుంతో, అయిదారు గంటల కాలక్షేపానికి పనికివచ్చే విజయవాడ అఖిల భారత ప్రదర్శన, మనోహరి, మధు లాంటి వారివి చాలా మందిని చాలా విధాల సంతోషాన్ని చేకూర్చింది.

పరధ్యానంగా వెళ్తోంది ఒక అమ్మాయి. వేగంగా వచ్చే ఎగ్జిబిషన్ రైలు తగులుతుం దేమోననే భయంతో ఒక్కసారిగా చేయి పట్టుకుని అవతలికి లాగాడు మధు, ఆ అమ్మాయిని.

"ఏమిటండీ అలా చూసుకోకుండా నడు స్తున్నారు" అని మధు ఆమెని అడిగాడు.

"ఏదో ఆలోచిస్తున్నానండి." థాంక్సు చెప్పింది ఆ అమ్మాయి.

ఆమె చెయ్యి పట్టుకొని లాగినందుకు 'ఏదైనా గొడవ చేస్తుందేమో'నని భయపడ్డాడు మధు. కాని అలా జరగలేదు.

"మీ పేరు తెలుసుకోవచ్చా?" ఆమె అందాన్ని చూస్తూ అన్నాడు మధు.

"నా పేరు మనోహరి" ఆమె చిరునవ్వుతో సమాధానం చెప్పింది నొక్కుల జుట్టుతో ఆరు అడుగుల ఎత్తు, మంచి కలరు వున్న మధు తెల్లని ప్యాంటు షర్టులో చాలా అందంగా కనిపించాడు మనోహరికి.

మనోహరంగా వున్న ఆ అమ్మాయి పేరు




మనోహరి కావటం విచిత్రం అనుకున్నాడు, మధు

"మీరు ఏమిచేస్తూ వుంటారు" అడిగాడు మధు.

"ఊసుపోక ఈ ఎగ్జిబిషన్‌లో యింటర్‌నేషనల్ కాస్మటిక్సు సాల్‌లో పనిచేస్తున్నావండి" అంది మనోహరి.

"మా నాన్నగారు బేంకర్‌లెండి. నేను చదువుకొని యింట్లో వుండటంతో ఏమీ తోచక మా పేరెంట్స్‌కి తెలియకుండా రోజూ ఎగ్జిబిషన్‌లో పనిచేస్తున్నాను. స్నేహితులతో కలిసి రోజూ ఎగ్జిబిషన్‌కి వెళుతున్నట్లు యింట్లో చెప్పి వస్తున్నాను" మనోహరి తన విషయం చెప్పింది.

"అంటె మోసం చేయటం మీ హాబీ అన్నమాట" చిరునవ్వుతో అన్నాడు మదు.

"అంటే మి వుద్దేశ్యం" మనోహరి జోకును గ్రహించినట్లు అడిగింది.

"ఆఁ ఏమీలేదు మి వాళ్ళకు యింట్లో ఏదోచెప్పి మోసం! చేస్తున్నారుగా" నవ్వుతూ సమాధాన మిచ్చాడు మధు.

"ఓ అదా ! అట్లా అనుకుంటే నిజమే" ఆమె కూడా నవ్వింది. "మరి నాతో స్నేహం చే య కూ డ దూ ? యింకొంచెంకాలం గడుస్తుంది" మదు అడిగాడు.

"స్నేహం అనేది అనుకుని చేసేది కాదు లేండీ" క్రిందకు చూస్తూ అంది మనోహరి

"పోనీలెండి మీకిష్టమైతనే చేద్దాం. మీ కభ్యంతరం లేకపోతే రేపు కూడా యీ ప్రదర్శన వాటికలోనే కలుద్దాం" అన్నాడు మధు

"రేపు సంగతి ఆలోచిద్దాంలెండి" అని మధు దగ్గర శెలవు తీసుకొంది మనోహరి.

వాళ్ళ యిద్దరూ అలా ఎగ్జిబిషన్ జరిగి నంతకాలం ఏదోటైంలో కలిసి తిరుగుతూనే వున్నరు.

ఆమె కాస్మటిక్సుస్టాల్‌లో| కూడా పని మానేసి మదుతో చక్కర్లు కొట్టసాగింది.

"ఏమిటి 'మనూ' నీలో నీవు నవ్వుకుంటున్నావు" మధు అడిగాడు ఒకరోజు వస్తూనే.

"ఏమిలేదండి యిందాక ఉచిత వైద్యశాల అని బోర్డు వుంటే, మీరు రావటం ఆలస్యం అయిందని లోనికి వెళ్ళాను.

అక్కడ ఒక డాక్టరు పేషంటుని షర్టు గుండీలు తీయమన్నాడు. వెంటనే స్టూలు మీద నుండి లేచి పేషెంటు డాక్టరుగారి షర్టు గుండీలు విప్పదీస్తున్నాడు" అని చెప్పి మనోహరి పకపకా నవ్వింది.

"మరి డాక్టరు ఏమన్నాడు?" మధు కూడా నవ్వుతూ అడిగాడు. డాక్టరు యింకా చాదస్తుడనుకుంటాను,

"నావి కాదయ్యా నీవి" అని డాక్టరు కోపంతో పేషంటు షర్టు చింపివేశాడు. ఆ పైన యిద్దరూ కలదుబడ్డారు. మనోహరి నవ్వాగలేదు.

"అంటే యిద్దరూ పిచ్చాసుపత్రికి సంబంధించిన వాళ్ళు అయి వుండాలి" అని మధు అనంగానే యిద్దరూ నవ్వుకున్నారు.

"నిన్న యిలాంటి ఒక తమాషా జరిగింది మనూ" అన్నాడు మదు.

"ఏమిటది?" ఆత్రంగా అడిగింది.

ప్రదర్శనవాటికలో ప్రచారం చేస్తున్న మైకులో శంకరరావుగారు ఎక్కడ వున్నా వెంటనే వచ్చి యిచట వేచివున్న భార్యా బిడ్డలను తీసుకువెళ్ళాలని పదేపదే ప్రకటించారు. కొంచెం సేపటికి పోలీసులతో శంకర

రావు ప్రత్యక్షమయ్యాడు. "ఏమిటివంతా!" ఎగ్జిబిషన్ ఆఫీసులో శంకరరావుని అడిగారు.

"వీరు నా భార్యాబిడ్డలు కారు, అయినా మైక్‌లో శంకరరావు వచ్చి వెంటనే భార్యాపిల్లలను తీసుకువెళ్ళాలని పదే పదే మైకులో ప్రకటిస్తున్నారు. ఇది పనికాదు అనుకొని పోలీసు రిపోర్టు యిచ్చాను" అన్నాడు అమాయకంగా శంకరరావు.

"మీరు ఎందుకొచ్చారండీ, ఇన్స్‌పెక్టరు గారు." పోలీసువారిని అడిగారు సొసైటీవారు.

"ఇతనికి బలవంతంమీద ఎవరినో అంటగడదామని చూస్తున్నట్లు అతను రిపోర్టు చేశాడు" అన్నాడు ఇన్స్‌పెక్టరు

ఆమె భర్త శంకరరావు కోసం మేము ప్రకటిస్తే యీ తిక్కశంకరం గొడవ ఏమిటండీ బాబు అని విసుక్కున్నారు సొసైటీ వారు.

బలేకేసే దొరికిందని తిట్టుకున్నారు పోలీసులు.

"చిన్నపిల్లలలాగా జైంట్‌వీల్ ఎక్కటమేమిటండీ?" అంది మనోహరి

"అంటే పెద్దవాళ్ళు ఎక్కేది ఏమైనా వుందా?" అని ఆమె చెయ్యి తన చేతిలోకి తీసుకోబోయాడు.

"ఊరుకోండి! ఎవరైనా చూడగలరు!" ఆమె సిగ్గుపడింది.

"ఎవరూ చూడకపోతే యిష్టమేగా?" ఆమె చేతిని నొక్కాడు.

"ఆశ పాపం!" అని గోముగా అంది మనోహరి

అలానే వారిద్దరూ ఏకమైనారు.

కోతిపిల్లను చూసినా, లేడిపిల్లలా అతని వక్షస్థలంమీద వాలిపోయేది మనోహరి

మనోహరికి ఎగ్జిబిషన్‌లో రకరకాల ప్రజంటేషన్లు కొన్నాడు మధు

వారం తిరిగేలోగా పెళ్ళి చేసుకోవాలన్నంత వరకూ వచ్చింది వారి ప్రేమ

ఆమె అందాన్ని సొంతం చేసుకోవాలని మధు ఆత్రుత

"మనం పెళ్ళి ఎప్పుడు చేసుకుందాం మనూ" అన్నాడు మధు

"ఈ ఎగ్జిబిషన్ ముగిసిన తరువాత వివాహం విషయం మాట్లాడుకుందాం" అనుకున్నారు.

ఒకరోజు ఎగ్జిబిషన్ నుండి యింటికి వెళ్ళేటప్పుడు ఆటోలో వెళ్ళారు. ఒక పెద్ద భవనం ముందు దిగింది మనోహరి.

"అంత పెద్ద భవనం వుందంటే, ఆమె నిజంగా కలవారి బిడ్డ కాక ఏమవుతుంది" అనుకున్నాడు మధు

ఒకరోజు ఒక ఖరీదైన నెక్లెసు చూపించి పెళ్ళికి తనకు అటువంటి నెక్లెసు కొనిపెట్టమని అడిగింది మనోహరి అప్పటిదాకా ఆగటం ఎందుకని, మధు వెంటనే నెక్లెసు కొన్నాడు. అది మనోహరికి అందజేయటానికి ఆమె కనిపించలేదు మధుకి మనోహరి యింటికి వెళదామంటే తను చెప్పేవరకు ఏ పరిస్థితిలోను తన యింటికి రావొద్దని కోరింది మనోహరి.

ఓర్పు నశించి ఒకరోజు మనోహరి యింటికి వెళ్ళాడు మధు

అందమైన యిరువది సంవత్సరాల అమ్మాయి ఎదురైంది మనోహరి కన్నా అందంగా వుంది ఆ అమ్మాయి.

"ఎవరు కావాలండీ మీకు" కోమలంగా అడిగింది ఆ కోమలి

"నేను ఒక ప్రైవేటు కంపెనీలో మేనేజరుగా పని చేస్తున్నాను నా పేరు మధు అండీ" అన్నాడు

"ఓహో మధుగారంటే మీరేనా" తెలిసినట్లుగా అంది

"మీరెవరండీ' ధైర్యంగా అడిగాడు మధు.

"నేను ఈ ఇంటి వారి అమ్మాయినండీ. నా పేరు మనోహరి" అంది ఆ అమ్మాయి.

"మనోహరి అని మరొక అమ్మాయి వుండాలండీ ఈ యింటో ఆ అమ్మాయి కోసం వచ్చాను" అన్నాడు మధు

"అవునులెండి ఆ అమ్మాయి 'మమత' మా పని అమ్మాయి పోలీసులు పట్టుకుపోయారు."

* * *

మధుగార్కి!

నేను మిమ్మల్ని ఎంతగానో ప్రేమించాను. అయినా, యింకా మోసం చేయలేక వెళ్ళిపోతున్నాను నేను మిమ్మలని మనసారా ప్రేమించాను ఆత్మీయులు దూరమైనప్పుడు అందరూ పడే విధంగా బాధ పడ్డాను కాని "నీ" ఎడబాటుతో ఎంతో తీవ్రమైన బాధ పడవలసి వచ్చింది ఈ బాధలో వెచ్చని ఆనందం వుంది. నేనూ మామూలుమనిషినే. అందుకే ప్రేమ భావానికి లొంగిపోయాను. నేను హైదరాబాద్ వెళ్ళిపోతున్నాను. నేను నాలోని బలహీనతను చెబుతాను. అది చదివి నన్ను క్షమించగలిగితే కృతజ్ఞురాలను. లేకపోతే మీ అభిమతం ప్రకారం ఎలా చేసినా నా కిష్టమే మాది మధ్యతరగతి కుటుంబం. మా నాన్నగారు చిన్నచిన్న కాంట్రాక్టులు చేస్తుండేవారు నాకు ఒక చెల్లి, ఒకతమ్ముడు వున్నారు. నేను బందరు హైస్కూల్లో స్కూలు ఫైనలు చదువుకునే రోజులలో మా కుటుంబం దివిసీమలో వుండగా ఉప్పెన వచ్చింది. ఆ వుప్పెనలో మా కుటుంబం



ఈ ముఖ్య సందేశమును మీ మిత్రులకు, బంధువులకు తెలియజేసి వారికి మేలుచేయండి.

# నెక్లెస్

మొత్తం తుడిచిపెట్టుకు పోయింది. నాకు పెద్ద చదువులు చదివి, భర్తతో కారులో షికారు చేయాలని, బంగారు నెక్లెస్ పెట్టుకోవాలని, మేడలలో, ఏ. సి. గదిలో కాపురం చేయాలని వుండేది. కానీ అన్నీ వుప్పెనలో కలిసి పోయాయి. మనస్సు సరిగా లేక, విజయవాడవచ్చి మనోహరిగారింట్లో పూడిగం చేసుకుంటూ, వారి పిల్లలకు చదువు చెప్పుకుంటూ వుండగా, మీరు నాకు తటస్థపడ్డారు. అంతే...నాలో కోరికలు గుర్రాలై పరుగెత్తాయి. నెక్లెస్‌మీద మనస్సుమళ్ళింది. అది యిస్తానన్నారు మీరు. ఎంతో మోసం చేస్తున్నాను అని తెలియకుండా మోసం చేశాను, క్షమించండి.

"మమత లెరుగని"
మమత.

ఉత్తరం చూచి హైదరాబాద్ వెళ్ళాక మధు సర్వీసుహోంలో వున్న మమతను పిలిపించాడు.

"నన్ను గుర్తుపట్టావా మమతా!" మధు ప్రశ్న.

"మీరువచ్చిన విషయం చెబితే సంతోషం. చచ్చిపోయినదాన్ని చంపటం మంచిది కాదేమో." క్రింద చూస్తూ కన్నీరుకార్చింది.

"నేను నీకు చాలా వస్తువులు ఇచ్చాను. నీవు అడిగిన నెక్లెసు కూడా యిద్దామని వచ్చాను" అన్నాడు మధు.

"అందుకు క్షమాపణ కోరాను. మీరు ఏ శిక్ష విధించినా సిద్ధమన్నాను. ఇంకా బాధ పెట్టకండి" బతిమాలుతున్నట్టు అంది మమత.

"ఇప్పటికే పోలీసులకి భయపడి యీ సర్వీసు హోంలో వున్నావు. ఏదో పరీక్షకు కడుతూ పనిని నేర్చుకుంటున్నావు. ఇంకా శిక్ష కావాలా" మధు ప్రశ్నించాడు.

"ఇంక నేను చెప్పేది ఏమీలేదు" మౌనం వహించింది మమత.

"సరే ! నీవు పరీక్ష వ్రాసిన తరువాత నా అడ్రసుకి లెటరు వ్రాసి వచ్చేసెయ్. నీ సమర్థన వారితే నేను ఉద్యోగం యిస్తాను" మధు ఆఖరిసారిగా తన అభిప్రాయంచెప్పాడు.

"అలాగే చేస్తాలెండి" అతని ముఖంలోకి చూచింది తెచ్చుకున్న ధైర్యంతో.

"నేవెళతాను మరి. ఈ నెక్లెస్ తీసుకో. దీనితో నీ అన్ని కోరికలు తీర్చినవాడ నవుతాను" మధు మామూలుగా అన్నాడు.

"వద్దండి. మీ సలహా, మీ అభిమానానికి ధన్యవాదాలు. నెక్లెసు మాత్రం వద్దు. నన్నిలా బ్రతకనివ్వండి" ప్రాధేయపడింది మమత.

"అలా కాదు. ఈ నెక్లెసు నీ దగ్గర ఉంచుకుని, నేను చెప్పినట్లు చెయ్" అన్నాడు మధు.

"చేస్తాను. కాని మీరు నెక్లెసు తీసుకుని వెళ్ళండి" అంది మమత.

"ఫరవాలేదు, తీసుకో మమతా. నీవు బాగుపడి, పరీక్ష పాస్ అయి ఏదో అల్లిక లాంటి పనులు నేర్చుకుని, నా దగ్గరకు వస్తే సంతోషిస్తాను. నీ కోరికలన్నీ తీర్చాననే సంతృప్తితో తిరిగి వెళతాను. మళ్ళీ కలుసుకోటం నా అభిమతం, ఇక నీ యిష్టం" అని నెక్లెసు మమత చేతిలో పెట్టి వెళ్ళిపోయాడు మధు.

మధులో మమతనే గాక దైవత్వాన్ని చూచిన మమత, అతని ఔదార్యానికి కన్నీరు కార్చటమే గాక వేయి నీరాజనాలర్పించింది తన మనస్సులోనే.

## గుర్రము-బండి

ప్రేమించి పెళ్ళి చేసుకోవడానికి, గుర్రపు బండికి చాలా దగ్గర సంబంధమున్నది. గుర్రం ప్రేమకు చిహ్నమైతే బండి సంసారానికి చిహ్నం. గుర్రాలను కట్టిన తెల్లటి బండి నగర వీధుల్లో కార్ల రద్దీలో మెల్లమెల్లగా పోతుంటే ప్రజలకు కూడా చూడటానికి ఎంతో ముచ్చటగా వుంటుంది. జర్మనీ యువతీ యువకుల్లో వివాహానంతరం తెల్లటి గుర్రపు బండిలో వూరేగింపుగాపోవాలనే కోరిక ఎక్కువవుతున్నది. ఇది మరల కొత్త చిగుళ్ళు వేస్తున్న వారి పాచీన సంప్రదాయం. పశ్చిమ జర్మనీలో వివాహం పట్ల కూడా ఎక్కువ మంది ఆకర్షితులౌతున్నారు. గతసంవత్సరంలో పశ్చిమ బెర్లిన్ నగరంలో 12వేల మంది జతలు వివాహాలు చేసుకుని దంపతులైనారు. గత యేడాది జననాల సంఖ్య కూడా చెప్పుకోతగినంతగా పెరిగింది.

# ★ వారఫలం ★

## 3–7 1981 శుక్రవారం మొదలు 9 7-1981 గురువారం వరకు

మేషం: ఎంత అపుదార్యం చూపినా, కొందరకు మీపట్ల అసూయాగ్రస్తులై ఉంటూనే ఉంటారు. వ్యాపారరంగంలో ఇదివరకటికన్నా ప్రగతి కనిపించగలదు. ఉత్సాహపరచేవారుకూడా కొందరు లేకపోరు. ఉద్యోగంలో ప్రగతి చాలమందికి, క్రీడావనిలో కొందరకు కనిపిస్తుంది. స్త్రీలకు: కుటుంబానందం, ఆదాయం అన్ని రంగాలలో అభివృద్ధి గల వారం.

వృషభం: బాగా ముందుకు అడుగిడదగిన వారమే. అన్నింట ప్రగతి కనిపించుట గ్రహింపగలరు. ఆదాయం కూడా అధికంగానే ఉంటుంది. ఉద్యోగంలో స్థాన చలనం గలదు. కొందరకు నూతనోద్యోగ ప్రాప్తికూడ సమకూర గలదు. విద్యా పరిశ్రమలో కొందరకు సుముఖత కనిపించగలదు. స్త్రీలకు: ఆదాయమున్నది. అలవాటు ప్రకారం చేసే పనులలో మేలు కనిపిస్తుంది.

మిథునం: గౌరవార్హమైన పదవులు కొందరకు లభింపనున్నవి. అతిథి అభ్యాగతుల రాక చెప్పదగిన వారం. విద్యా పరిశ్రమలో చాలామందికి అనుకూలత కనిపిస్తుంది. అధిక విద్యాభ్యాసానికి అనుగుణంగా విద్యార్థులకు ఆశించిన సీట్లు దొరుకగలవు. స్త్రీలకు: వృత్తి వ్యాపారాలలో అనుకూలత, నూతన విషయాలు తెలిసికొనుటకు అవకాశం లభింపగలదు.

కర్కాటకం: కళా రంగంలో, రచనా వ్యాసంగంలో, పత్రికా ప్రకటనలో, చాలా మందికి అనుకూలప్రదమైన వారం. గతంలో కాక నిలిచిన పనులు ఈ వారంలో నెరవేరు అవకాశమున్నది. వ్యాపారంలో ఎలాంటి లోపము లేదని గుర్తించుట అవసరం. స్త్రీలకు: సుఖ శాంతులకు, ఆదాయానికి, వృత్తిలో ప్రగతికి ఏ మాత్రం లోపం కనిపించదు.

సింహం: ఆరోగ్యంలో మార్పులు గమనింపనున్నారు. అధికోష్ణత వలన శరీరం దెబ్బ తినవచ్చు. అవుషధ సేవ తప్పదనిపించనున్నది. విశ్రాంతి కావలసిన సమయం, విరోధి వర్గీయులు కూడా తలెత్తగల సమయం, వివాదాలు, మనస్పర్థలకు అవకాశంగల వారం. స్త్రీలకు: ప్రత్యేకంగా ఇరుగు పొరుగు గొడవలు, శాంతి లోపం యిత్యాది ఫలితాలుండగలవు.

కన్య: ఇంకా ఏలి నాటి శనిగ్రహ బాధ తప్ప లేదనిపించే సంఘటనలుండగలవు. స్థల మార్పు కూడా చెప్పదగిన సమయం. ఏ అనానుకూలత సంభవించినా, వోర్మితో సర్దుకొనిపోవడం, అలవాటు చేసికోవాలి. అనవసరమైన ప్రస్తావనలకు పోకుండుట ఎంతైనా మంచిది. స్త్రీలకు: వస్తు వాహనాలు కొనుగోలు చేయ ప్రయత్నించడం వృత్తిలో చెప్పదగిన అభివృద్ధి కనిపించడం, నూతన వ్యవహారాలలో అనుకూలత ప్రాప్తించదగిన కాలం.

తుల: చేతికందినట్టే ఉండి లాభం జారిపోయే మార్గమున్నది. మీకు సాయం చేయాలని ఉవ్విళ్లూరే వారుంటారు. ఏదోవిధంగా వ్యయం తగులుతూనే ఉంటుంది. పెద్దల అనుభూతి, అధికారుల ఆదరణ లభించే వారం. స్త్రీలకు: ఇంటి వ్యవహారాలతో, సంతానము అభివృద్ధికి పాటు పడడంలో, వ్యాపారంలో అనుకూల కాలమే.

వృశ్చికం: చాలా శాంతంగా, విమర్శ దృష్టితో అన్ని పనులు నెరవేర్చుకోవాలి. కుటుంబంలో ఏదో శుభ కార్యం జరుగనున్నది. అవసరానికి ధనం సమకూడే అవకాశమున్నది. కోర్టు వ్యవహారాల బెడద కొంత కాలం వేధించగలదు. ఉద్యోగం అనుకూలదాయకంగా సాగే మార్గమున్నది. స్త్రీలకు: ఉన్నతోద్యోగ లాభం, శుభకార్యప్రస్తావనలు ఉండటం గమనించగలరు.

ధనుస్సు: మిమ్మలను మాటలతో నొప్పించే వారుంటారు. ఉద్యోగంలో, సమాజంలో, సభలలో మీకు అనుకూలత చెప్పదగిన వారం. వ్యాపారంలో అవసరమైన అండదండలేర్పడగలవు. దేహారోగ్యం మాత్రం ఏ మాత్రం తృప్తికరంగా ఉండదు. స్త్రీలకు: ఆదాయం, అభివృద్ధి, వృత్తిలో ప్రగతి సంభవం.

మకరం: మనస్సులోని మాట కచ్చితంగా, ధైర్యంగా చెప్పటంతో కొందరిచే రావలసిన అవకాశాలు రాకపోవచ్చు. వృత్తి వ్యాపారాలు సరిగా సాగవు. వారారంభంలో అందినట్లే అవకాశాలుండి మాయంకాగలవు. స్త్రీలకు: బంధువులు ఇంటికి రావడం, శుభ కార్య ప్రస్తావనలుండగలవు. పెద్ద మొత్తం చేతికందే మార్గమున్నది.

కుంభం: భారీ వ్యాపారం బాగా సాగే మార్గమున్నది. జాయింటు వ్యాపారంలో ఇబ్బందులుండగలవు. ఒకవేళ నష్టంసంభవించే మార్గం కూడ గలదు. లాభదాయకమైన అవకాశాలు జారిపోయే మార్గమున్నది. వాహనమో, వస్తువో, ఏదైనా కొనుగోలుచేసే మార్గమున్నది. స్త్రీలకు: నూతన విషయాలు గ్రహించడం, నూతనోద్యోగాలు ఫలించడం జరుగుతుంది.

మీనం: 'శ్రమ ఒకరిది, అనుభవం ఒకరిది'గా గ్రహింపగలరు. వ్యాపార వ్యవహారాలు సుముఖంగా సాగే మార్గమున్నది. 'గత కాలాని కన్నా' ఈ వారం చాలా సుగుణంగా ఉన్నదని మీరే గ్రహింపగలరు. విద్యా వ్యాసంగంలో ఖ్యాతి లభింపగలదు. స్త్రీలకు: నూతన ప్రయత్నాలు ఫలించడం, ఉత్తరాల మూలాన ప్రముఖ వార్తలు గ్రహించడం, క్రీడావనిలో అవకాశాలు లభించడం గ్రహింపనున్నారు.

– విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

కప్పు క్రింద పెట్టి, పైకిలేచి అటు యిటు పచార్లు చేస్తూ, ఉదయం స్నేహితులన్న మాటలు గుర్తుకురాగా, తండ్రివైపు తిరిగి 'తండ్రి ఒక ఐ. ఎ. ఎస్. ఆఫీసరుగా రిటైరు అయినా, ఎక్కడా నేను ఉద్యోగం సంపాదించలేక పోతున్నానని నా స్నేహితు లందరు నన్ను ఎగతాళి చేస్తున్నారు. వారి ఎదుట తల ఎత్తుకొని తిరగలేక, సిగ్గుతో తల వంచుకోవలసి వస్తోంది'' అన్నాడు, తన ఉద్యోగానికి తండ్రి సిఫారసు చేయలేదన్న కోపంతో.

''ఎదుటివారి వద్ద తల వంచుకోవాల్సిన తప్పు నిన్ను కన్న తండ్రికాని, నీవుకాని ఏమి చేయలేదే! ఏ తప్పు చేయందే ఎదుటివారివద్ద ఎందుకు తలవంచుకోవాలి? నీవు తలవంచుకో వలసింది యిప్పుడు కాదు. నా సిఫారసుతో నీకు ఉద్యోగం వస్తే, ఆనాటి నుండి ఆజ న్మాంతం తలవంచుకొని బ్రతకాల్సిన పరిస్థితి వస్తుంది ఎందుకంటే నీ స్వయం శక్తి సామర్థ్యాలతో, ఉద్యోగంలో ఉన్నతశిఖరాలను అధిరోహించిన, అవన్నీ ఈ తండ్రి సిఫారసు ద్వారానే సంపాదిస్తున్నావని, నిన్నివాడు గేలి చేసిన ఆ స్నేహితులే రేపు దెప్పి పొడుస్తారు. కాబట్టి బాబూ, బాధపడకుండా సిఫారసు లతో పనులు చేయించుకోవటం కాకుండా, స్వయం శక్తితో పని చేసుకోవటం నేర్చుకో! వెళ్ళి స్నానంచేసి డ్రస్ మార్చుకో! నేనలా క్లబ్ వరకు వెళ్ళివస్తాను'' అనేసి పైకి వెళ్ళి పోయాడు మరల కొడుకువైపు చూడకుండా

తండ్రి వెళ్ళినవైపే చూస్తూ 'ఈ కాలంలో ఉండవలసిన వారు కాదు' అను కుంటూ లోనికి నడిచాడు శ్రీధర్.

* * *

శ్రీధర్‌కు విద్యాశాఖలో ఆఫీసరు ఉద్యోగానికి యింటర్వ్యూ వచ్చింది మరల. ఆ యింటర్వ్యూ చేసే ఆఫీసరు తన తండ్రిదగ్గర సహాయకుడు [అసిస్టెంటు]గా పనిచేసిన వారేనని తెలిసి, తనకు ఉద్యోగం రావటం ఖాయమన్న ధీమాతో, కోహినూర్ వజ్రం దొరికినంత సంతోషంతో తండ్రి దగ్గరకు యింటర్వ్యూకార్డు పట్టుకొని పరిగెత్తాడు.

చిరంజీవి గదిలో తీరికగా కూర్చొని ఆ రోజు దినపత్రిక తిరగేస్తున్నాడు గుమ్మం దగ్గర అలవాటైన అడుగుల చప్పుడు విని, పేపర్లో నుండి తలఎత్తి చూచాడు. మెర్క్యూరీలైటు కాంతితో కొడుకు ముఖం వెలుగుతూ కనిపించింది. ఈమధ్య కొడుకు ముఖంలో కానరాని నవ్వు ఈరోజు కనిపించ టానికి కారణం వెదుకుతూ, లోనికి రమ్మని సైగ చేసి, ''ఏమిటి బాబు. ఏదైనా అపాయింట్ మెంట్ ఆర్డరు వచ్చిందా! చాలా సంతోషంగా ఉన్నావు'' నవ్వుతూ అడిగాడు.

''ఒక విధంగా అలాంటిదే డాడీ!'' కూర్చుంటూ చెప్పాడు.

''అలాంటిదేకాని, అది కాదన్నమాట. ఓకే! ఏమిటి విశేషం'' డొంకతిరుగుడుమాట లన్నా, లౌక్యం ఉపయోగించినా యిష్టపడడు చిరంజీవి చిన్నతనం నుండి ఆ విషయంలో స్వపర భేదములు లేకుండా అందరిని సమా నంగానే చూస్తాడు.

''నాకు విద్యాశాఖలో ఆఫీసరు ఉద్యోగానికి యింటర్వ్యూ వచ్చింది'' కొద్దిగా ముందుకు వంగి చెప్పాడు.

''సంతోషం! క్షేమంగావెళ్ళి ఉద్యోగంతో రా!'' వెనక్కు జారబడుతూ అన్నాడుతేలికగా.

''ఇంటర్వ్యూ చేసే ఆఫీసరు మీ దగ్గర సహాయకుడుగా పనిచేసినాయనేనట'' తను వచ్చినపని చెప్పటానికి నాందిగా తొలిపలుకు లులా అన్నాడు

ఎప్పుడూ యింటర్వ్యూకెళ్ళేముందు చెప్పే కొడుకు యింటర్వ్యూ రాగానే పూర్తి సమాచారం సేకరించి తనవద్దకు ఎందుకు పరుగెత్తుకొచ్చాడో యిప్పుడర్థమైంది. అయినా అదేమి పైకి కనిపించకుండా ''అతను ఎవరి దగ్గర పనిచేసారన్నది కాదు ప్రధానం. అతనుచేసే యింటర్వ్యూకు నీవు చెప్పే సమాధానాలు ముఖ్యం. అవే నీకు ఉద్యోగం రావటానికి సరియైన సిఫారసులు'' అన్నాడు సహజ ధోరణిలో.

''అవన్నీ నియమాలకోసం, పెళ్ళితంతులా పైకి జరిపించేవి. మనకు కనిపించేవి. ఆఫీసులోజరిగే యింటర్వ్యూ నామమాత్రంగా జరుగుతుంది. అసలు యింటర్వ్యూ ఎవరికి కనిపించకుండా ఆఫీసరుగారి యింట్లో జరుగు తుంది. అందులో నెగ్గి ఆఫీసరును సంతృప్తి పరచినవారికి మాత్రమే ఉద్యోగం.'' తను చూచిన యిరవై యింటర్వ్యూల అనుభవం తండ్రికి లేదన్న ఉద్దేశ్యంతో, తండ్రికి తెలియనిది చెబుతున్నట్లుగా చెప్పాడు

''అందరూ అలాగే ఉంటారని ఎలా అను కుంటున్నావు? నా సర్వీసులో ఏ ఉద్యోగం ఎవరికీ సిఫారసు ద్వారా యివ్వలేదు. ఏ పనీ సిఫారసుతో చేయలేదు. ఎవరికీ సిఫారసు చేయలేదు'' తన నిజాయితీకి గర్వపడుతూ అన్నాడు.

''అందరూ మీలాగే వుంటారన్నగ్యారంటీ ఏమిటి డాడీ! మీరలా సిద్ధాంతాల నడిగట్టు కొని కూర్చున్నారు గాబట్టే, ఈరోజు నాకు ఏ ఉద్యోగం రాలేదు'' పోయిన అవకాశాలను తలచుకుంటూ, అందుకు కారణమైన తండ్రి మీద కోపంతో, విసుక్కున్నట్లుగా అన్నాడు.

''ఇంతకూ నన్నేమిటి చెయ్యమంటా విప్పుడు?'' ఏదో పని ఉన్నట్లు పైకి లేచి అడిగాడు

''నాకు ఉద్యోగమిమ్మని అతనికి సిఫారసు చేయాలి.''

''సిఫారసు చేయడం నా నియమానికి



అన్యాయం చేయటం ఆత్మహత్యకంటే మహా పాపం. అందుకే ఆ పాపం చేయటానికి నా అంతరాత్మ ఒప్పుకోవటం లేదు కాబట్టి నీ మెరిట్‌తో ఉద్యోగం మెచ్చినప్పుడే చేరు. మనం ఉద్యోగం లేకపోతే బతకలేని స్థితిలో లేముకదా! ఇంట్లో తోచక ఉద్యోగం కోసం వెతికే నీవు, బతకలేక ఉద్యోగంకోసం తిరిగే పేదవాడికి అడ్డు తగులుతున్నావు. నీలాంటి ఉన్నవారు ఉద్యోగాలకోసం ఊర్లంట తిరగకుండా, స్వయం ఉపాధికోసం ప్రయత్నిస్తే ఎంతో బాగుంటుంది. దానివలన దేశానికి నిరుద్యోగ సమస్య తగ్గుతుంది మరి కొంత మంది నిరుద్యోగులకు ఉపాధి లభిస్తుంది. ఆలోచించు'' అన్నాడు

'మీరెన్ని చెప్పినా నా మనసు మార్చలేరు. మారదు డాడీ! ఈ ఉద్యోగానికి మాత్రం మీరు తప్పకుండా సిఫారసు చేయాలి.'' మంచిగా వాదించలేక మొండిగా ఆజ్ఞాపిస్తున్నట్టుగా అన్నాడు.

''తప్పు చేయవద్దని పదిమందికి చెప్పిన నేను, అదే తప్పు మనసు చంపుకొని, ఎలా చేయమంటావు బాబు'' తన నిస్సహాయతను వెలడించాడు.

''మీరు మనసు చంపుకొని బ్రతకటమెందుకు మీ ఆశయాలు, సిద్ధాంతాలు కోసం కన్నకొడుకును బలియిచ్చి, బాగా బ్రతకండి!'' కోపంగా అని వెళ్ళబోయాడు.

''బాబూ!'' షాక్ తిన్నట్టుగా ఆవేదనతో గట్టిగా అని పట్టుకున్నాడు. కొడుకు ఏటువంటినిర్ణయంతీసుకున్నాడోఅర్థమైందతనికి.

''అవును డాడీ! మీరు పనిచేసిన డిపార్ట్‌మెంటులో కూడ నాకి ఉద్యోగం రాకపోతే, నేను రేపు తల ఎత్తి పదిమందిలో తిరగలేను. అందుకే అనుకున్నది సాధించలేక ఈ లోకం నుండి శాశ్వతంగా పోవాలనుకుంటున్నాను. నా కోసం మీరు మీ సిద్ధాంతాలను వదులుకోవడమెందుకు కన్న కొడుకును కూడా ఖాతరు చేయకుండా ఆశయాలకోసం బ్రతుకుతున్న మహానుభావునిలా కీర్తి ప్రతిష్ఠలు మరిన్ని ఆర్జించి హాయిగా బ్రతకండి!'' కళ్ళలోకి నీరు తెచ్చుకొని పైకి చూస్తూ బాధగా అన్నాడు.

ఆ మాటలకు చిరంజీవి చలించిపోయాడు అన్ని ఆశలు పెట్టుకున్న కొడుకు అతి నిష్ఠూరంగా మాట్లాడటంతో, కొడుకు మనసు మారదని తెలుసుకొని, తన మనసే మార్చుకొని ''నేను బ్రతుకుతున్నది ఆశయాల కోసం కాదు బాబు. నీకోసం. నీ అభివృద్ధి కోసం'' అన్నాడు ఆరాటంగా!

''నాకోసం, ఈ ఒక్కసారికి మీ ఆశయాలన్నీ మర్చిపోయి, సిఫారసు చేయండి డాడీ! ఉద్యోగం వస్తుంది. ఆపైన మిమ్మల్ని మరెప్పుడూ సిఫారసు చేయమని యిబ్బంది పెట్టను. ప్లీజ్ డాడీ!'' దగ్గరకెళ్ళి గెడ్డం పట్టుకొని ప్రాధేయపడుతున్నట్టుగా అన్నాడు.

''కన్నకొడుకు కోసం కట్టిన ఆశయాల ఆలయం, ఆ కొడుకు కోర్కె తీర్చటం కోసమని కూలదోస్తే బాధపడటమెందుకు. నీకోసం మొదలు పెట్టి నీతోనే అంతం చేస్తాను'' బాధను దిగమింగుకుంటూ అన్నాడు ప్రేమతో పెంచుకున్న పూల

## సముద్రం హెచ్చరిక

నువ్వు
గులకరాయి వేసినా
గుండు పడవేసినా
నాలో ప్రతి నీటికణం స్పందిస్తుంది
అలలు అలలుగా వ్యాపిస్తుంది.
నీకిదే ఆట అయితే
అదేపనిగా రాళ్ళువేస్తూపోతే
నా హృదయమే ఘూర్ణిల్లి,
ఉవ్వెత్తుగా పెనుకెరటాలో లేస్తాను
నీ నామరూపాల్లేకుండా చేస్తాను,
జాగ్రత్త!

— జి. వెంకటేశ్వర్లు

మొక్కను, పూలు పూచే వేళకి తన చేతులతోనే నరికివేయవలసి వస్తుందన్న బాధపడే తోటమాలిలా.

అదేమీ శ్రీధర్ పట్టించుకోకుండా ''థాంక్యూ డాడీ! థాంక్యూ వెరీమచ్!'' సంతోషంతో తండ్రికి కృతజ్ఞతలు చెప్పి హుషారుగా పైకి వెళ్ళిపోయాడు

జీవితంలో అపురూపంగా చూసుకునే వస్తువు చేజారి కిందపడి చిదికిపోయినట్టుగా బాధపడుతూ, ఒకవైపు మనసు 'నన్ను చంపకు, నన్ను చంపి నీవు బ్రతకకు' అని హెచ్చరిస్తుంటే, దానికి 'ఈ ఒక్కసారికి నా మాట వినమని' నచ్చచెప్పి, కాళ్ళు 'రానని' మొండికేస్తున్న బుజ్జగించి, చిరంజీవి ఆఫీసరు యింటికి వెళ్ళి, అతిథి సత్కారాలు ఘనంగా అందుకొని, తను వచ్చిన పని నెమ్మదిగా బోనులో నిలబడిన ముద్దాయిలా తలవంచుకొని చెప్పి, తడబడే అడుగులతో బైటపడి, గట్టిగా ఊపిరి పీల్చుకున్నాడు. అక్కడున్నంతసేపు హత్య చేసిన వానిలా ముచ్చెమటలుబట్టి చెప్పవలసిన మాటలు కూడ సరిగా చెప్పలేదేమో ననిపించింది. తప్పు వెనుక యింత తడబాటు ఉంటుందని మొట్టమొదటిసారిగా తెలుసుకున్నాడు చిరంజీవి.

శ్రీధర్ నూతనోత్సాహంతో, సిఫారసు బలంతో యింటర్వ్యూకెళ్ళి, అడిగిన ప్రశ్నలన్నింటికి సరిగా సమాధానాలు చెప్పి, ఉద్యోగం తప్పకుండా వస్తుందన్న ధీమాతో యింటికి వచ్చాడు ఆనందంగా

ముచ్చటగా మూడు రోజులు గడిచాయి.

హాలులో తండ్రి,కొడుకు కూర్చొని లోకాభిరామాయణం మాటాడుకుంటుండగా పోస్టులో శ్రీధర్ పేర ఒకటి, చిరంజీవి పేర ఒకటి రెండు ఉత్తరాలు వచ్చాయి.

''చూశారా డాడీ! సిఫారసు లేనిదే ఈ రోజులలో ఉద్యోగాలు రావంటే మీరు నమ్మేవారు కాదు మీరు యిలా సిఫారసు చేశారో లేదో, అలా ఉద్యోగానికి ఆర్డరు వచ్చింది'' అన్నాడు సంతోషంతో చేతిలోని ఉత్తరం చూపిస్తూ.

''ఇంతకూ అది విప్పిచూశావా!'' తన కంటితో చూడనిదే దేనిని నమ్మని చిరంజీవి, మూసిఉన్న కవరును చూస్తూ సంశయాన్ని వెలిబుచ్చాడు.

''మీ కన్నీ అనుమానమే! ఆఫీసు నుండి వచ్చిన దాంట్లో ఆర్డరుకాక యింకేముంటుంది డాడీ!'' అంటూ తండ్రి పేరుతో ఉన్న కవరు తండ్రికి యిచ్చి, తన పేరుతో నున్న కవరు విప్పి చదవసాగాడు. చదువుతున్నంతసేపు కొడుకు ముఖంలో రంగులు మారుతుంటే అర్థంకాక అలా చూస్తూ ఉండిపోయాడు చిరంజీవి

ఉత్తరం చదవటం పూర్తిచేసిన తరువాత కుర్చీలో వెనక్కు జారగిలబడిపోయాడు మతిపోయినవానిలా, నోటి మాట లేకుండా.

''ఏముంది బాబు దానిలో'' ఆత్రతగా అడిగాడు.

ఉన్నది చెప్పలేక చదువుకోమని ఉత్తరాన్ని తండ్రికిచ్చాడు

చిరంజీవి ఉత్తరం చూచాడు

## ధర్మపథం  "మూడు" ప్రాధాన్యం  — బులుసు వెంకటరమణయ్య

సంఖ్యలలో మూడు అనేది చాలా ముఖ్యమైనది. లోకాలు చాలా వున్నా స్వర్గ, మర్త్య, పాతాళాలు మూడులోకాలే ముఖ్యమైనవి. మూడు సంఖ్యలో వున్న బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురే ముఖ్యదేవతలూ జీవితానికి సంబంధించిన సృష్టి, స్థితి, లయములు మూడే గుణాలు సత్త్వము, రజస్సు, తమస్సు అనేవి మూడే

ఏదయినా విషయాన్ని నిర్ణయానికి తీసికొనేటప్పుడు మూడవసారి చెప్పినదే తుది నిర్ణయంగా ఉంటుంది.

వేలంపాటలో మూడవసారి చెప్పేదే తీర్పుగా గ్రహించబడుతూ ఉన్నది. దేవాలయంలో గర్భగుడికి అగ్నికి ముమ్మారు ప్రదక్షిణం వెయ్యడం పరిపాటి.

ఈ విధంగానే మూడుముళ్ళు వెయ్యడం ప్రసిద్ధంగా ఉన్నది — ఒకముడి వేస్తే జారి పోవచ్చు రెండు ముళ్ళు వేస్తే అంత దృఢంగా ఉండకపోవచ్చును. మూడు ముళ్ళు వేస్తే మరి విడిపోకుండా ఉంటుంది. వివాహ సమయంలో వధువు మెడలో వరుడు మంగళ సూత్రాన్ని కట్టేటప్పుడు మూడుముళ్ళు వేయిస్తారు. మూడు ముళ్ళు వెయ్యడం ముఖ్యం కూడా. "మూడుముళ్ళు పడ్డాయి" అంటే వివాహం జరిగింది అనే అర్థం — వాడుకలో ఉన్నది. అది విడిపోని బంధం అన్నమాట. వధూవరుల కిద్దరికీ ఉండే బంధం ఎప్పుడూ విడిపోకూడదని అభిప్రాయం. అంటే భార్యాభర్తలు ఎన్నడూ ఒకరి నొకరు విడిచి ఉండరాదని అది సూచిస్తుంది.

వివాహం జరిగేటప్పుడు వరునిచేత "ధర్మేచ, అర్థేచ, కామేచ నాతిచరామి" అని అనిపిస్తారు. గృహస్థాశ్రమంలో ధర్మార్థ కామాలు మూడు పురుషార్థాలూ ముఖ్యమైనవి. ఆ మూడింటికీ భార్యయొక్క సాహచర్యమే కావాలి విధిపూర్వకమైన ధర్మ కార్యానికి అర్ధాంగి ప్రక్కన కూర్చోవాలి. సంసారంయొక్క ఆర్థిక విషయంలో ఆమెతో ఆలోచించడం ముఖ్యం ఆ విధంగానే సంసార సుఖాలకు ఆమెయే ఆధారం అందువల్ల ఈ మూడింటి విషయంలోనూ ఆమెను అతిక్రమించనని చెప్పడమే వాని అభిప్రాయం. మంగళసూత్రానిక వేసే మూడు ముళ్ళలోనూ ఒకటి ధర్మానికీ, రెండవది అర్థానికీ, మూడవది కామానికీ చెందినవనీ, ఆ మూడు ముళ్ళూ దంపతుల ఐకమత్యానికీ సూచకాలనీ మనం గ్రహించవలసి ఉంటుంది.

---

## తప్పా! ఒప్పా!

"మీరు యింటర్వ్యూలో అత్యధిక మార్కులతో పాసయారు. కాని మీరు మీ తండ్రిగారి ద్వారా చేయించిన సిఫారసు మీ అనర్హతగా భావించి, మీకీ ఉద్యోగం యివ్వటం లేదు యిది మీ ప్రథమ తప్పుగా భావించి శిక్షించకుండా వదలి పెడుతున్నాం"

ఉత్తరం చదవటం పూర్తిచేసి టీపాయ్ మీద పెట్టి, ఏదో జ్ఞాపకం వచ్చిన వానిలా, తన పేరుతో వచ్చిన ఉత్తరాన్ని గబ గబా విప్పి చదివి, చప్పగా చల్లబడి తన కుర్చీలో వెనక్కి జారగిలబడి కళ్ళు మూసుకున్నాడు, బాధల భావం పైకి కనిపించకుండా.

ఉత్తరం చదివి కూడ తండి ఏమి మాట్లాడకపోయేసరికి, తండ్రి చేతిలోని ఉత్తరం తీసుకొని చదవసాగాడు.

"మహారాజశ్రీ గురుతుల్యులు, గౌరవ నీయులైన చిరంజీవిగార్కి వందనములతో ముకుందరావు వ్రాయునది: ఉభయకుశలోపరి.

మీరు తీర్చి దిద్దిన ఈ శిల్పం బలంలేని గాలికి ఎలా పడిపోతుందని ఆశించారు? నిప్పు లాంటి మీ సహచర్యంలో పనిచేసిన నేను తప్పు చేస్తానని ఎలా అనుకున్నారు? ఆ రోజు గుర్తుందా! మీరు డైరెక్టరుగా ఉన్న రోజులలో మన డిపార్టుమెంటులో నా తమ్ముడికి ఇంటర్వ్యూ వస్తే, ఆ ఉద్యోగం నా తమ్ముడి కిమ్మని, వాడికుద్యోగం వస్తే ఆర్థిక యిబ్బందులు కొన్నయినా తీరి, చితికి పోయిన నా కుటుంబం కుదుటబడటానికి ఆధారమవుతుందని, మిమ్ములను ప్రాధేయ పడినప్పుడు, మీరు నన్ను మెత్తగా చీవాట్లు పెట్టి, ముందెప్పుడూ మరెవరికి యిటువంటి సిఫారసు చేయవద్దని చెప్పటమే కాకుండా నా సిఫారసు కారణంగా నా తమ్ముడికి ఉద్యోగ మివ్వటంలేదని కాగితం పంపించారు. ఇదంతా మీకు జ్ఞాపకం చేసినది, ఆనాడు మీరు చేసిన పనికి ప్రతీకార చర్యగా యిది చేసానని చెప్ప టానికి కాదు. ధర్మం కోసం ప్రాణమిచ్చే ధర్మరాజు లాంటి మీ క్రమశిక్షణలో పైకి వచ్చిన నేను, ఎలా అడ్డుదారిన నడుస్తానని మీరు ఊహించారని. ఆనాటి సంఘటన తరువాత నేను మనసు మార్చుకొని మీ మార్గాన్నే అనుసరిస్తూ, అడుగుజాడల్లో నడుస్తున్నాను. ఆశయాలను పాటిస్తున్నాను. కన్న మమకారాన్ని చంపుకోలేక, ఆశయాలను చంపుకొని, అవసరం లేకపోయినా, ఉద్యోగం చేస్తానన్న మీ కుమారుని కోరిక తీర్చటం కోసం మీరు ఉద్యోగం కోసం సిఫారసు చేసి; నా ఆశయాలను వదులుకొని, ఆత్మను చంపుకొని తప్పుచేయలేక, నా విధినిర్వహణము సక్రమంగా నిర్వహించాను — అని అనుకుంటు న్నాను. మీ మాట మన్నించనందుకు క్షమించ గోర్తాను. నేను చేసినది "తప్పా! ఒప్పా!" నా ఉద్యోగ నిర్వహణలో నేను ఎంతవరకు కృత కృత్యుడనయ్యానో మీరే నిర్ణయించాలి."

తన తండ్రి ఎంత గొప్పవాడో ఉత్తరం చదివిన తరువాత శ్రీధర్ తెలుసుకొని, తన కారణంగా తండ్రికి వ్రతభంగం అయినందుకు, అయినా ఫలితం దక్కనందుకు బాధపడ్డాడు. మరెప్పుడూ సిఫారసు చేయమని తండ్రిని అడగకూడదని నిర్ణయించుకున్నాడు. అదే విషయం తండ్రికి చెప్పాడు.

'నీవు చేసింది నూటికి నూరుపాళ్ళు ఒప్పే ముకుందం! తప్పంటూ ఉంటే అది వాదే! జీవితంలో మొట్టమొదటి సారిగా ఓడి పోయినా, ఓటమిలో గెలుపు పొందాను. నా శిష్యుడు ఇంతటి గొప్పవ్యక్తిగా మారినందుకు, అతని ప్రవర్తనతో కొడుకు మనసు మార్చి నందుకు, విజయం వాదిగా సంతోషిస్తు న్నాను.' మనసులో అనుకుంటూ, ఆనందంగా ఆనంద బాష్పాలు రాల్చాడు సంతోషం పట్టలేక.

# వంటలు

## కలకండ పొంగలి

**కావలసిన వస్తువులు :** బియ్యం అరకిలో, పెసరపప్పు ఒక కప్పు, కలకండ 350 గ్రా, జీడిపప్పు 100 గ్రా, ఎండుద్రాక్ష 50 గ్రా, ఏలక్కాయలు ఆరు, కొద్దిగా కుంకుమపువ్వు, నెయ్యి అరకప్పు, కొద్దిగా కేసరి పౌడర్.

**తయారుచేయు విధము :** ముందుగా బాణలిలో పెసరపప్పును పోసి దోరగా వేయించికొని దించాలి తర్వాత జీడిపప్పును నేతిలో ఎర్రగా వేయించి తీసి పెట్టుకోవాలి. కుంకుమ పువ్వును కొద్దిగా పాలలో కలిపి పెట్టాలి ఒక పాత్రలో ఒకటిన్నర లీటరు నీరు తీసుకుని పొయ్యిపై పెట్టి మరుగుతున్నప్పుడు బియ్యమును, పెసరపప్పును పోయాలి బియ్యము, పప్పు బాగా వుడికాక పొడి చేసిన కలకండను వేయాలి. ఇప్పుడు సగం నెయ్యి పోయాలి అడుగంటకుండా కలుపుతూ వుండాలి కలకండ అంతా కలిసిపోయాక జీడిపప్పు, ఎండు ద్రాక్ష వేసి కలపాలి. తర్వాత కుంకుమపువ్వు కలిపిన పాలను, ఏలక్కాయల పొడిని, మిగిలిన నెయ్యిని వేసి బాగా కలపాలి. చివరగా కేసరి పౌడరు వేసి కలిపి దించాలి.

— గార్ల సరస్వతి

## బచ్చలి పకోడీలు

**కావలసిన వస్తువులు :** బచ్చలి ఆకు చిన్న గిన్నెడు, సెనగపిండి అరకేజి, పచ్చిమిరపకాయలు 10, జీలకర్ర ఒక స్పూను, ఉప్పు తగినంత, నూనె పావుకేజి.

**తయారుచేయు విధానం:** మొదట బచ్చలి ఆకును శుభ్రంగా కడిగి, నీరు వంచి, సన్నగా తరుగుకోవాలి. పచ్చి మిరపకాయలు కూడా తరుక్కోవాలి ఈ రెండింటినీ సెనగపిండిలో వేసి, జీలకర్ర, ఉప్పు వేసి, కొంచెం నీళ్ళు పోసి బాగా కలపాలి. పొయ్యిమీద బాణలిలో నూనె వేసి,కాగిన తర్వాత ఈపిండిని పకోడీల మాదిరిగా నూనెలో వేసి, ఎర్రగా వేగిన తర్వాత తీసుకోవాలి.

— ఎం. రాజేశ్వరి

# వంద వసంతాలు చూసినకవి!

సోవియట్ యూనియన్ లోని కిర్గిజ్ రాష్ట్ర కవి షమెయి తొక్తొబాయ్ 1980 వేసవిలో తమ శత జన్మదినోత్సవం జరుపుకొన్నారు జల్పి గ్రామంలో జన్మించిన ఆయన జీవితం పర్వతాలలోని ఇస్సిక్ - కుల్ సరోవర్ తీరాలలోనే గడిచిపోయింది ఆ గ్రామంలో ఆబాలగోపాలం అందరూ ఆ కవిని అక్సాకల్ అనే పిలుస్తుంటారు. కిర్గిజ్ భాషలో ఈ మాటకు అర్థం 'తెల్లగడ్డం' అని. ఒక వృద్ధుని గౌరవంగా అట్లా పిలవటం పరిపాటే!

అక్సాకల్ షమెయి జీవితం అసాధారణమైనది. మూడవ ఏట ఆయన తలిదండ్రులను కోల్పోయారు 12వ ఏట ముల్లా సేవలో ప్రవేశించడం తటస్థించింది జారిస్టు ప్రభుత్వం విధించిన ప్రవాస శిక్షను అనుభవిస్తూ, ఆనాటి సామ్రాజ్యంలో సర్వులూ ఉపేక్షించిన ఒక ప్రాంతంలో – కిర్గీజియాలో – ఉంటూ వచ్చిన ఒక రష్యన్ విప్లవకారుడు ఆయనకు బోధించడంతో, ఆలస్యంగా 34వ ఏట ఆయన చదువుకోవడం మొదలయింది. ఆ తరువాత కూడా ఆయన పాఠశాలకు వెళ్ళి చదువుకొనలేదు.

కిర్గీజియాలో సోషలిస్టు విప్లవం విజయవంతమైనప్పుడు షమెయికి 37 సంవత్సరాలు. ఆయనే తన గ్రామపు తొలి ఉపాధ్యాయుడయినారు. చదువులేని, అంధకార బంధురమైన తన బాల్యపు కఠిన కాలాన్ని జ్ఞాపకం పెట్టుకొని ఆ కవి, యువతరానికి విద్యాబుద్ధులు గరపటానికి శక్తి వంచనలేకుండా కృషిచేశారు ఆ తరువాత ఆ ప్రాంతపు తొలి సమిష్టి క్షేత్రానికి మేనేజరయి, దానికి ఒక వ్యవస్థను కల్పించి అది పెంపొందేటట్లు కృషి చేశారు.

చాలా కాలంగా ఆయన కవిత్వం చెబుతున్నారు. ఒక పద్యం కట్టడం, స్నేహితులకు వినిపించడం తరువాత దానిని మరచిపోవడం ఆయనకు మామూలయింది. ఎన్నడూ వాటిని కాయితంమీద రాయలేదు.

అరవయ్యవఏట ఆయన తొట్టతొలిగా తన కవితలను కాయితంమీద పెట్టాడు. తన కోసమని రాసుకొన్నాడేగాని వాటివల్ల పేరు ప్రఖ్యాతులను ఆయన ఆశించనేలేదు.

తోటి గ్రామస్తులతోపాటు 77వ ఏట ఆయన మాస్కోను చూడడానికి వెళ్ళారు. ఆ సోవియట్ రాజధాని ఆయన మనస్సు మీద ఒక గాఢమైన ముద్రను వేసింది. ఆ సందర్భాన ఉత్తేజనతో ఆయన నూర్ జవోన్ 'మంచి రోజులు' అని మాస్కోలోను, స్వస్థలానికి రైలులో, బస్సులో వస్తూను పుంఖాను పుంఖంగా కవితా రచనలను చేశారు.

ఆయన తోటి గ్రామస్థులలో ఒకరు, ప్రముఖ రచయితలకు, జానపద కవులకు, కిర్గిజ్ రచయితల సంఘంలో పలువురికీ వాటిని చూపించారు. 78వ ఏట అక్సాకల్ షమెయి రచయితల సంఘ సభ్యులలో ఒకరయినారు. రిపబ్లిక్ పత్రికలు ఆ కవితలను బహుళంగా ప్రచురించాయి. 'షమెయి తొక్తొబాయ్–యూలు'గారి కవితలు కిర్గీజియాలోనూ, సోవియట్ దేశమంతటానూ, ప్రఖ్యాతికెక్కాయి.

అప్పటిబట్టి ఆయన 20 సంవత్సరాల పైచిలుకు కవిత్వాన్ని ఆరాధిస్తూ, వీరవతైన 200 జానపద గాథలకు పైగానూ,పలు సామెతలనూ రచించి, ఈనాటి రచయితలకు సాహిత్య చరిత్రకారులకు ఉపదేశకుడు అయినారు.

# హైదరాబాదు నోట్ బుక్

### సంస్కృత ప్రాకృతాల ఆదాన ప్రదానం !

పూర్వం భాషలెన్నో ఉన్నప్పటికీ ఇప్పటిలాగ భాషాద్వేషంలేదని, సంస్కృత, ప్రాకృత, అపభ్రంశాది భాషలలో విద్వాంసులు పరస్పరం రచనలు సాగించేవారని, రాజులు అన్ని భాషలవారినీ ఆదరించేవారని, ముఖ్యంగా రాజులు ప్రజాభాషఅయిన ప్రాకృతాన్ని ఆదరించి రచనలు సాగించారని ఉస్మానియా విశ్వవిద్యాలయం సంస్కృత శాఖాధ్యక్షులు డాక్టర్ ప్రమోద్ గనేశ్ లేలే మే 19వ తేదీ సాయంకాలం దక్షిణాంచలీయ సాహిత్య సమితి (గాంధినగర్) కార్యాలయంలో జరిగిన సమావేశంలో ప్రసంగించారు. సంస్కృత కవులు ప్రాకృతాపభ్రంశ దేశ భాషల కావ్యాలకు సంస్కృత వ్యాఖ్యానాలు చేశారని, ప్రాకృత కవులు సంస్కృతంలోనూ రచనలు సాగించారని ఆయన వివరించారు. ఒక్క గాథాసప్తశతికే పదిహేను సంస్కృత వ్యాఖ్యలున్నాయని ఆయన అంటూ, సంస్కృత గ్రంథాలకు ప్రాకృత వ్యాఖ్యలు చేశారని, హేమచంద్రాదులు సంస్కృత ప్రాకృతాలలో రచనలు సాగించారని, ఈ సంప్రదాయం 18వ శతాబ్దం వరకు కొనసాగిందని అన్నారు. భాషాద్వేషం నేటి రాజకీయవాదులు తెచ్చిపెట్టినదని ఆయన అన్నారు. నేటి పరిస్థితిని బట్టి విద్వాంసులు బహుభాషావేత్తలు కావాలని ఆయన సూచించారు. శ్రీ తిరుమల రామచంద్ర ఈ సమావేశానికి అధ్యక్షత వహించారు. దక్షిణాంచలీయ సాహిత్య సమితి అధ్యక్షులు డాక్టర్ భీంసేన నిర్మల్ స్వాగతంచెప్పారు. చివరన దక్షిణాంచలీయ సాహిత్య సమితి కార్యదర్శి శ్రీ కుట్టన్ పిళ్లే ధన్యవాదాలు చెప్పారు. చర్చలో డాక్టర్ రంగయ్య, డాక్టర్ నాగేశ్వరరావు, డాక్టర్ మోహన్‌సింగ్, డాక్టర్ ఆర్.రామచంద్ర, శ్రీ డి. రాజ పాపారావు, శ్రీ కరన్‌లాల్, డాక్టర్ సి. హెచ్. రాములు మున్నగువారు పాల్గొన్నారు.

### మత ప్రచారం పేరుతో రాజకీయాలు :

అమెరికా, అరబ్ దేశాల ఇస్లాం, క్రైస్తవ మత ప్రచారం పేరుతో భారతదేశ సమగ్రతకు భంగం కలిగించడానికి కుట్రచేస్తున్నాయని అంతర్జాతీయ ఆర్యన్ లీగ్ అధ్యక్షుడు శ్రీ రాం గోపాల్ జి, ప్రధాన కార్యదర్శి, పార్లమెంటు సభ్యుడు ఓంప్రకాశ్ త్యాగి పృథ్వీసింగ్ ఆజాద్, శ్రీవందేమాతరం రామచంద్రరావు మే 14వ పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో అన్నారు. దేశంలో విదేశీ ధనం చేరవేయడాన్ని, మతం మార్పిడిని నిషేధించాలని శ్రీ త్యాగి సూచించారు. క్రైస్తవుల, ముస్లింల సంఖ్యను పెంచి ప్రత్యేక రాజ్యస్థాపన వారి కుట్ర అని, దీనికి నాగాల్యాండ్, మేఘాలయ, మిజోరం, మణిపూర్‌లు ఉదాహరణమని ఆయన హెచ్చరించారు. ఏ ముస్లిం దేశంలోను మైనారిటీలకు రక్షణ లేదని, భారత దేశంలో ముస్లింలు ఆనందంగా ఉన్నారని శ్రీవందేమాతరం అన్నారు.

### శ్రీ చంద్రచూడ్ సలహా :

న్యాయ వ్యవస్థలో రాజకీయాలు వద్దని భారత ప్రధాన న్యాయమూర్తి శ్రీ వై. వి. చంద్రచూడ్ సలహా యిచ్చారు. న్యాయవాదులు రాజకీయాలతో సంబంధం పెట్టుకోవచ్చునని, కాని, ఆ రాజకీయాలు న్యాయ వ్యవస్థలో ప్రవేశించరాదని ఆయన హెచ్చరించారు. హైదరాబాద్‌లో మే రెండవవారం జరిగిన క్రిమినల్ అడ్వకేట్ కార్యగోష్ఠి ముగింపు సందర్భంగా ఆయన పై హెచ్చరిక చేశారు. న్యాయవాదులు, న్యాయమూర్తులు పరస్పర సహకారంతో ఉన్నప్పుడే న్యాయ వ్యవస్థ పట్ల ప్రజల అపోహలు తొలగిపోతాయని ఆయన అన్నారు. యువ న్యాయవాదులు న్యాయశాస్త్రమే కాక సాహిత్యం, చరిత్రమున్నగు విషయాలు కూడ బాగా అధ్యయనంచేసినప్పుడే సమర్థులయిన న్యాయవాదులవుతారని ఆయన సూచించారు. పేదల పక్షాల వాదించడానికి సీనియర్ న్యాయవాదులు ముందుకు రావాలని ఆయన కోరారు.

### 101 కొత్త తాలూకాలు :

రాష్ట్రంలో 101 కొత్త తాలూకాలు ఏర్పడుతాయి. దీనివల్ల మొత్తము తాలూకాల సంఖ్య 311 అవుతుంది. మరి నాలుగు పంచాయతీ సమితులు కూడా ఏర్పడనుండడం వల్ల మొత్తం పంచాయతీ సమితులు 332 అవుతాయి. ఈ విషయాన్ని ముఖ్యమంత్రి శ్రీ అంజయ్య మే 12వ తేదీన మంత్రివర్గ సమావేశం తరువాత ప్రకటించారు. మరికొన్ని వందల మందికి ఉద్యోగాలు వస్తాయి.

### గుడిసెల భీమా పథకం :

అగ్ని ప్రమాదాలు, దాడులు, భూకంపాలు వరదలు, తుఫానులు మున్నగు వాటికి గురి అయి గుడిసెలు కూలిపోతే యజమాని నష్టపడకుండా రాష్ట్ర ప్రభుత్వం గుడిసెల భీమా పథకాన్ని ప్రవేశపెట్టనున్నది. ఇలాటిపథకం మరే రాష్ట్రంలోను లేదు. ఈ పథకాన్ని తొలుత వరంగల్, ఖమ్మం, కర్నూలు, కడప, గుంటూరు, కృష్ణా, శ్రీకాకుళం జిల్లాలలో ప్రారంభిస్తారు. అదిన్నీ ఎంపిక చేసిన కొన్ని మునిసిపాలిటీలలో, ఈ పథకం ప్రకారం ప్రతి గుడిసెను రెండువేలకు భీమా చేస్తారు. దీనిలో సగం ప్రభుత్వం చెల్లిస్తుంది, తక్కిన సగం గుడిసె యజమాని చెల్లిస్తాడు. ఏ ప్రమాదం వల్లనయినా గుడిసె కూలిపోతే భీమా డబ్బు వెయ్యి రూపాయలు గుడిసె యజమానికి లభిస్తుంది. తక్కిన వెయ్యి కొత్త గుడిసె వేసుకొనడానికి మదుపుగా ఉంటుంది.



**ఆంధ్రకేసరి వర్ధంతి :**

ప్రకాశం ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ డెవలప్‌మెంట్ స్టడీస్ మే 20, 21 తేదీలలో శ్రీ సురవరం ప్రతాపరెడ్డి ఆడిటోరియంలో శ్రీ ప్రకాశం 25వ వర్ధంతి సభ ఏర్పాటు చేసింది. శ్రీ ప్రకాశం జీవిత విశేషాలు తెలిపే ఛాయా చిత్రాల ప్రదర్శనం కూడ ఏర్పాటు చేశారు. ప్రదర్శనాన్ని రాష్ట్ర ప్రభుత్వ సాంస్కృతిక శాఖ డైరెక్టర్ శ్రీ జె.వి. సోమయాజులు ప్రారంభించారు. నిరాశా నిస్పృహలతో సతమత మవుతున్న నేటి యువకులకు శ్రీ ప్రకాశం జీవిత చరిత్ర మార్గ దర్శకమని ఆయన అన్నారు. ప్రకాశం ఇన్‌స్టిట్యూట్ అధ్యక్షుడు డాక్టర్ ఎం. ఎ. రాజగోపాల్ ప్రసంగిస్తూ, శ్రీ ప్రకాశం పంతులు ఆంధ్ర రాష్ట్రం కోసం చేసిన కృషిని గురించి, ఆయన అసమాన వ్యక్తిత్వం గురించి ఆంధ్రప్రదేశ్‌లోనే తగినంత ప్రచారం లేదని, ముందు తరాల వారికి ఆయన సేవ తెలియడానికి ఇకనైనా ప్రచారం చేయాలని అన్నారు. ప్రారంభంలో ప్రకాశం ఇన్‌స్టిట్యూట్ డైరెక్టర్ డాక్టర్ టి. సూర్యనారాయణరావు స్వాగతంచెబుతూ శ్రీ ప్రకాశం వివిధ రంగాలలో చేసిన కృషిని వివరించడానికి ఒక డాక్యుమెంటరీని నిర్మించాలని లోగడ జరిగిన కృషి అజాపజా లేదని, ప్రకాశం పట్ల ప్రభుత్వం తగినంత శ్రద్ధ వహించటం లేదని అన్నారు. శ్రీ ప్రకాశం జీవితాన్ని సంక్షిప్తంగా శ్రీ తెన్నేటి విశ్వనాథం సిద్ధపరచి పంపగా ప్రభుత్వ ప్రచురణ విభాగం దానిని త్రిప్పి పంపిందని ఆయన విచారం ప్రకటించారు. రెండవ నాడు ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుడు శ్రీ ఆవుల సాంబశివరావు "రాజకీయాలు— సేవా ధర్మం" అనే విషయమై ప్రసంగిస్తూ, గ్రామ సీమలో పురోగతి చెందనంత కాలం దేశంముందుకు వెళ్లదని అన్నారు. గ్రామ సమస్యల పరిష్కారానికి ప్రస్తుత గ్రామ పంచాయతీల స్థానంలో గ్రామీణ ప్రజా సంఘాలు నెలకొనాలని, యువకులు నాయకత్వం చేపట్టాలని ఆయన సూచించారు. గ్రామాల అభివృద్ధికోసం ఆనాడు ప్రకాశం సిద్ధపరచిన పథకాలలో కొన్నిటిని అందరికీ ఆమోద యోగ్యమయిన తీరులో అమలు పరచాలని ఆయన సూచించారు. శ్రీ ప్రకాశం మహా రాజ భోగాలు అనుభవించి, తర్వాత మహాత్యాగిగా మారాడని, మనిషిలో పౌరుషాన్ని, అన్యాయాన్ని ఎదిరించే శక్తిని ఉద్దీప్తం చేయడానికి ఆయన నిరంతరం కృషి చేశారని, స్వరాజ్య పత్రికను ప్రారంభించి ప్రజల నాడులలో నూతన రక్తాన్ని నింపడానికి ఆయన దీక్ష పూని, ఆదాయవ్యయాలు కూడ పరిగణించలేదని శ్రీ సాంబశివరావు అన్నారు. శ్రీ ప్రకాశం ధైర్య సాహసాలను, త్యాగ నిరతిని చరిత్రాత్మకంగా పరిశీలించి ఆయన జీవిత చరిత్రను రచించాలని శ్రీ సాంబశివరావు సూచించారు. ఉత్సవాలకు తొలి రోజు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం జరుపుతూ ఆంధ్రకేసరి పేర ప్రభుత్వం ఒక గ్రంథాలయాన్ని నెలకొల్పుతుందన్నారు. శ్రీ ప్రకాశం, శ్రీ పొట్టి శ్రీరాములు, స్వామిరామానందతీర్థ, పండిట్ నరేంద్ర ఆంధ్ర రాష్ట్రం కోసం ఎన్నో త్యాగాలు చేశారని, ప్రకాశం పంతులు చిట్ట చివరి వరకు కృషి చేసిన ఆశయాల అమలుకు శాయశక్తులా పాటుపడుతామని ముఖ్యమంత్రి అన్నారు.

# అవీ - ఇవీ - అన్నీ

## దోనేపూడి రాజారావు సాహిత్య వైభవం

ప్రముఖరచయిత శ్రీ దోనేపూడిరాజారావు, తెనాలి సాహిత్య రజతోత్సవ సమితి వారు వెలువరించిన సావనీర్ మా కార్యాలయం చేరింది. ఇందులో రచయిత మీద శ్రీయుతులు రెంటాల, హితశ్రీ, సంజీవదేవ్, కొండముది శ్రీరామచంద్రమూర్తి, క్రొరపాటి గంగాధరరావు మున్నగు అనేకులు వ్రాసిన ప్రశంసా పూర్వక వ్యాసాలు న్నాయి. వెల 10 రు.లు వలయువారు పై సమితి పేర తెనాలికి వ్రాయాలి

## శ్రీ రామాయణ కథాసుధ

కుశలవులు గాన మొలికించిన రామాయణ కథాసుధ వచనం రచన శ్రీ అన్నంరాజు సత్యనారాయణరావు. 216 పుటలు, వెల: 12 50. ప్రతులకు : రచయితపేర 5వలైను, పండరీపురం, గుంటూరు—522002కి వ్రాయవచ్చును.

## చైతన్య జ్యోతి

అద్దేపల్లి భారతకుమార్ రచన సాంస్కృతి సమాఖ్య, బాపట్ల, గుంటూరు జిల్లావారి ప్రచురణ, 32 పుటలు. వెల మూడు రూపాయలు.

## జ్ఞానమూర్తి కథలు

శ్రీ జ్ఞానమూర్తి రచించి ప్రచురించిన ఈ పుస్తకంలో కైదీ, దేవుడు చేసిన మేలు, మీరా, తోడూ—నీడ, అమ్మ మార్గం, ఎవ్వరిది వింటున్నాడు?, మానవ చరిత్రలో మసం ఉంటున్న రోజు, ఇదోలోకం, చోటే ఉమర్ ఖయ్యాం, పూలమాల కథలున్నాయి. 96 పేజీలు. వెల రు. 8. ప్రతులకు: నవయుగ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సుల్తాన్‌బజార్, హైదరాబాద్ — 500001.

## యువస్వరాలు

యువ స్వరాలు అనే సమాఖ్య సాహిత్య సమాచార పత్రిక మున్న (విజయవాడ) నుంచి వెలువడుతున్నది. మా కార్యాలయం చేరింది. వెల తెలియదు. వివరాలకు— ఎస్. కె. వాకాటి, మున్న, విజయవాడ521212 కి వ్రాయాలి.

## కేరళలో మార్క్సిస్టుల మారణహోమం

రచన: శ్రీ మూర్తి. 24 పేజీలు వెల: రు. 1.25పై. ప్రతులకు: సాహిత్య నికేతన్, నారాయణగూడ, 3—4—705 4 హైదరాబాద్ - 500029.

## మంజీర స్వనాలు

కవితా సంకలనం. ఉదయభారతి ప్రచురణ. 64పేజీలు వెల 3 రూ.లు. ప్రతులకు ప్రచురణ కర్తల పేర నవకవితా సమితి, 83, సరోజినీ దేవిరోడ్డు, తిరుపతికి వ్రాయాలి. ●

## హైదరాబాదు నోట్ బుక్

**జిల్లాకొక నాట్యాచార్యుడు :**

రాష్ట్రంలో నాట్య కళను అభివృద్ధి పరచడానికి మూడేళ్లలో ప్రతి జిల్లాలోను ఒక నాట్యాచార్యుణ్ణి నియమించదలచుకున్నట్లు నృత్య అకాడెమీ అధ్యక్షులు శ్రీ నటరాజ రామకృష్ణ మే24 న పత్రికా ప్రతినిధులకు తెలిపారు. ఈ జిల్లా నాట్యాచార్యులను హైదరాబాద్‌లో శిక్షణ ఇచ్చి పంపుతామని, మరుగైపోయిన నృత్య రీతులను పునరుద్ధరించడానికి కూడ అకాడెమీ కృషి చేస్తుందని ఆయన తెలిపారు. నిర్దిష్టమైన నాట్య సంప్రదాయాలను ముందు తరాల వారికి అందజేయడానికి శ్రీ వెంపటి పెదసత్యం, శ్రీ వేదాంతం జగన్నాథ శర్మ, శ్రీ వెంపటి చినసత్యంల ప్రదర్శనాల డాక్యుమెంటరీలను తయారు చేసి భద్ర పరచాలని అకాడెమీ తల పెట్టిందని ఆయన అన్నారు. సంగీత నాటక అకాడమీల సహకారంతో ద్వైమాసపత్రిక ప్రారంభించడం, రామప్ప, లేపాక్షి దేవాలయ శిల్పాల భంగిమలపై పరిశోధనలు జరుపడం మున్నగు ప్రతిపాదనలున్నాయని ఆయనఅన్నారు. వివిధ నృత్యాల పరిశోధన ప్రచార ప్రచురణలకోసం నృత్య అకాడెమీ నాలుగు సంఘాలు నియమించిందని ఈ సంఘాల సూచన మేరకు పథకాలు నిర్వహిస్తామని ఆయన అన్నారు.

**ఉపశ్రుతి :**

కౌలాలంపూర్‌లో జరిగిన ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభల అవకతవకలన్నింటికీ ట్రావెల్ ఏజంట్ కారణమని విధాన సభ చర్చలలో అందరూ అనడం ఏం బాగుంది ? అని నన్నడిగారొకరు. నేను జవాబు చెప్పేలోపలే "ఆడలేక మద్దెల ఓడు అనే సామెత వూరికే పుడుతుందా ?" అని నా పక్కనున్న పెద్దమనిషి సమాధాన ప్రశ్న వేశారు.

— తిరుమల రామచంద్ర




**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3, Editor: S. Radhakrishna**

# శుభ్రమైన తాజా శ్వాస...
# ఆరోగ్యం చిందే గట్టి పళ్ళు



# కోల్గేట్
## డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోమకుంటి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోము కోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

**కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.**

***నోటి దుర్వాసనను ఆపండి...***
***కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో***
***దంతక్షయాన్ని ఎదుర్కోండి!***




DC.G.74 TL






"టొమాటో నాలా పుష్టిగా తాజాగా ఉంటేనే 'ప్రియ' దృష్టిలో పడుతుంది. మేలయిన మసాలాలు, స్వచ్ఛమయిన నూనెల చెలిమి లభిస్తుంది. అదే విధంగా చక్కని ఆరోగ్య సూత్రాలతో అధునాతన ఫాక్టరీలో రుచులన్నీ నింపుకొని మీ విందుకువస్తాను. అందమైన సీసాల్లో కళకళలాడుతూ నిలబడతాను. అదుగో...అప్పుడే మీ నోరూరుతోంది. మరింక మాటలనవసరం!"

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ 'ప్రియ' పచ్చళ్లు 300, 650 గ్రాముల సీసాల్లో దొరుకుతాయి.

- మామిడి కాయ
- నిమ్మకాయ
- టొమాటో
- అల్లం
- గోంగూర




**ప్రియ ఫుడ్స్**
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
**MARGADARSI MARKETING PRIVATE LIMITED**
Eenadu Compound, Hyderabad. 500 004

# ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ

KIRON/PF/8017